ఓమ్

శ్రీరామగురవేనమః

# అద్వైత

# బ్రహ్మానుభవప్రకాశిక.

రచయిత:

ములుకుట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి.

కొల్లవారిపాలెము.

ప్రథమ ముద్రణము.

బెజవాడ

వాణీముద్రాక్షరశాలయందు ముద్రితము.

1940

# విషయసూచిక

# పీఠిక



సుహృన్మణులారా!

సుప్రసిద్ధులగు నీ గ్రంథకర్తగారి నెఱుంగనివారు లేరు. వీర లద్వైత తత్త్వ నిజదర్శన సంపూర్ణానుభవముచే నూరూర నింటింట నాబాల గోపాలమును పేరు వడసిన మహనీయులు. ఇమ్మహాపురుషుఁడు జన్మప్రభృతి ద్వైతా ద్వైత విశిష్టాద్వైత ప్రణాళికలచే బ్రహ్లాదునివలె భగవంతు నారాధించిన పరమ భాగవతోత్తముఁడు. అనర్గళ వైరాగ్యానుభవ మహాభాగ్యముచే శుకుఁ బోలిన యపరశుకుఁడు. నిరంతర హరితత్త్వ నిర్వచన సముత్సుక హృదయుండగు భాగవత సమభ్యాసిత వ్యాసుఁడు. మఱియు జనకునివలెఁ బరతత్త్వ సామ్రాజ్య పట్టాభిషిక్తుఁడు. శ్రీకృష్ణునివలెఁ జరాచర మధురతర హృదయ సుమధుర సాస్వాదన తేజోవిరాజితుఁడు. ఇమ్మహాత్ముఁడు ద్రష్ట్ర భ్రాంతినశమునఁ జంద్రుఁడు జలస్థితుఁడుగా భావింపఁబడినట్లు నిర్లిప్తుఁడయ్యుఁ గృహస్థాశ్రమమునున్నవాఁడు. మఱియును శ్రీమచ్ఛంకరాచార్యులవలెఁ గారణాంతర పురస్కృతుఁడై యవతరించిన దేవతా సార్వభౌముఁడు. ఆ యతీంద్రునివలె ననతి కాలమున నపరోక్షానుభవ ద్విగుణీకృతాఖండ బ్రహ్మానంద సుధా మాధుర్యమునఁ జొక్కి పాంచభౌతిక కృత్రిమ శరీరమును విసర్జించి త్రికాలాబాధితము శాశ్వతస్వరూపమును స్వీకరించిన విశేష శేముషీ మహాత్ముఁడు. వీరి నివాసస్థలము ఒంగోలునకు సమీపముననున్న మొట్టువారి పాలెము. వీరికి జ్ఞానోప

దేశముఁ జేసి యత్యుచ్చ స్థితికిఁ దెచ్చినది ప్రతాప రామాభిధానులుగారు. వీరలది బాపట్ల తాలూకా వల్లూరు. శిష్య ప్రముఖులలో నొకరగు నేతద్గ్రంథ రచయిత శ్రీగురు సార్వభౌములకు నాంతరంగిక భక్తాగ్రగణ్యులు. ఇట్టి భగవద్భక్తు లస్తమించుటచే శ్రీగురు సార్వభౌముల వారికిని వారి చిరతర పరిచయ సుధామధువానిన లోకము నకును తీరని యసంతృప్తి వాటిల్లినది. తద్వియోగానల దోధూయమాన మానసులగు తన్మహాత్మ బంధు బృందము నకు సర్వేశ్వరుఁడు చిరతర శాంతి నొసంగి ప్రోచుఁగాత. ఈ పుస్తకము సార్థక నామము కలదని వేరుగాఁ బలుక నవసర ము లేదు. గ్రంథకర్త బమ్మెర పోతరాజువలెఁ దైవాయత్త శుద్ధ వచస్కుఁడు. సిద్ధ వర్గోచ్ఛ్విలాసితుఁడు. ప్రసిద్ధ వేదాంతి రాద్ధాంత ప్రతినిబద్ధ శుద్ధాద్వైతానుభవాను భావితుఁడు అవిరత మహావేగాయాతాంధ్ర గిర్వాణ వాక్ప్రతతి ద్రవ ప్రణుతి ప్రవణుఁడు. అట్టి ఇమ్మహనీయుని కవితా వైశారద్య మును గుఱించి ప్రత్యేకించి చర్చించు టనవసరము.

ఇట్లు,

గురు సేవా సమితి

15—3—1939

పూర్ణానందతీర్థస్వాములవారు
(అను ఆశ్రమనామము వహించిన)



శ్రీ గురు ములుకుట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

గ్రంథకర్త.



శ్రీమతి దత్త కాశమ్మగారు

గ్రంథ ప్రకాశకురాలు



ఓమ్.

శ్రీరామ గురవే నమః.

# అద్వైత పూర్ణానుభవ ప్రకాశిక.

శ్లో॥ గురుర్బ్రహ్మా । గురుర్విష్ణుః
గురుర్దేవో । మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః

ఉ॥ శ్రీమదఖండసత్యఘన • చిన్మయరూప మనోహరుండు శ్రీ
రాము మునీవరుండు సుమి • రాజిత ముక్తి రమాధిపుండు చి
త్సోము కరుండు సర్వజన • కేవల భావ విదుండు భక్త హృ
త్తామ హితుండు దివ్య సుఖ • దాతను నైన గురుండు
గాచుత॥

సేవింతున్ నిజదాన హృన్నిలయు వి ♦ శ్వేశున్ గృపా
సాగరున్। భావింతున్ మది దేవ కీర్తనయును ♦ బ్రహ్మణ్యు
శ్రీ కృష్ణునిన్। గావింతున్ నిజ వృత్తులన్ హరికి
కా ♦ న్కల్ గాఁగ నర్పింతమున్।

శ్రీవిష్ణు ప్రార్థన.

శా॥ శ్రీ నారాయణ! వాసుదేవ! నృహరీ ♦ చిద్రూప సర్వేశ వి
జ్ఞానానంద మయ స్వభావ! గుణ తే ♦ జస్తత్త్వ సిద్ధాంత బో
ధానందానుభవైక వేద్య! జగదా ♦ ధారా! ప్రసన్నాత్మ! నే
ధ్యానింతున్ మదియందు త్వచ్చరణ ప ♦ ద్మంబుల్ సదా
భక్తితోన్।

శ్రీ ఉమా మహేశ్వర ప్రార్థన.

చ॥ పరశివ స్వ స్వరూప పర ♦ భావ కృపారస వీచులంబు శ్రీ
గురు నిజ రూప దర్శనని ♦ గూఢ సుబోధ పరాత్మ
సూచనాంతరగసమద్దృష్టి యోగపర ♦ తత్త్వ విలాస మొనంగెఁ
గాన! సిథరణి ఉమా మహేశ్వరులఁ ♦ దప్పక గొల్చెద
నెమ్మనంబునన్।

## శ్రీ గురు పరంపరాఽభివర్ణనము

సీ॥ ఆది నారాయణుం డాది దేశికుఁడు గా
నాదిత్యుఁ డొంటె ము న్నాత్మ పదవి
నా మహామహుని పూర్ణానుగ్రహము జెంది
పంచ శిఖుం డల పరము గాంచె
నా మునీంద్రుని పాద మాత్మను సేవించి
జనక భూవరుఁడు తత్సరణి గాంచె
శుకుఁడు జనకు చేత శుద్ధాత్మ గని దాను
దెల్పె సద్ధాని సాందీపు నకును

తే॥ గీ॥ అంత సాందీప గురువర్యు నధిక భక్తిఁ
జేసి శ్రీ కృష్ణుఁ డొందె నా క్షేమ పదము
కృష్ణ పరమాత్ము శాశ్వత కృపను బడసి
శ్రీధర స్వామి గాంచె సుస్థిరపదంబు.

సీ॥ శ్రీధర స్వామిని సేవించి దక్షిణా
మూర్తియుఁ డాఁ గాంచె ముక్తి పదవి
నా మహనీయుని నాత్మ భజించి మఱి
శివరామ దీక్షితుల్ సిద్ధిఁ గనిరి
శివరామ దేశికశిష్యుఁడై యప్పయ
యలరెఁ బూర్ణానంద మాత్మపదము
నప్పయ గురువర్యు నధికమౌ కరుణచే
పరశురాముల వంశ పావనుండు

తే॥ గీ॥ నరసయాఖ్యుండు తానొందె స్థిరపదంబు;
అట్టి నరహరి పాదము లాత్మయందు

గొలచి పోలూరి పాపయ గురువరుండు
పూర్ణ తత్త్వ స్వరూపమై పూజ్యుఁడయ్యె.

తే॥ గీ॥ ఉన్న వానంద దేశికు డుర్వియందు
పరగ పాపయ గురువర్యు పాదపద్మ
ములకు భక్తి దొనర్చి సన్ముక్తిఁ జెంది
స్వస్వరూపానుభవమైన సరణి గాంచె.

శా॥ ఆనందార్యు పదారవిందములఁ దాసాత్మన్ సదా
గొల్చి పూ । ర్ణానందాత్మ ప్రతాప రామ విబుధుం
డద్వైత రూపంబు వి । జ్ఞానుండై గనె నమ్మహాత్ముని
నిజాజ్ఞన్ స్వస్వరూపార్థ సి । ద్ధ్యానంబున్ గొని యున్న
ధన్యుడను సుబ్రహ్మణ్య నామాత్ముఁడన్.

క॥ శ్రీ నారాయణుఁ డాదిగ
నేనే బ్రహ్మమని దెల్పు నిజగురు దనుకన్
నానావిధ సంస్తుతులన్
నా నేర్చుకొలంది వందనమ్ములుఁ జేతున్

-* కవివంశ ప్రశంస *-

సీ॥ శ్రీ ములుకుట్ల వంశేందుమండల భాసుఁ
డాదెయ యనుపేర నలరువాడు
ఆయనసతి గౌరియననొప్పు నా భార్య
తమ్మ దివ్యజ్ఞాన మణిగొమ్మ
ఆదంపతులకు మున్నానంద యుతముగా
గల్గె సంతతియు శంకరుని కృపను

అందు నల్వురు పుత్రు లరయ పుత్రికలు ము
వ్వురును విజ్ఞానమ్ముఁ బొంది మోక్ష
తే॥ గీ॥ తత్త్వ సామ్రాజ్య వేత్తలై దనరు వారి
లోన మూఁడవ తనయుండు లోకహితుఁడు
ద్వైత భావుండు నిత్య సత్యవ్రతుండు
జాలమాఖ్యుండు నలరె నీజగతియందు.

సీ॥ వసుధను మాఁజేటి వంశ విస్తారుండు
ఘనుఁడు దా వెలసె వేంకటచలార్య
డా మహామహుని క ర్ధాంగియై యొప్పెను
సుబ్బమయును దివ్య సుభగచరిత
ఆ దివ్యదంపతు లనువుగా పసగొకం
డాత్మబాలకుఁ గనె హరి నిరుణము
అరయ నాల్వురు బుత్రు లైదుగు రతివలం
దఱును భక్తి జ్ఞాన ధనములు
తే॥ గీ॥ వారలందఱు గడపటి వనిత యనఁగ
బాల్యమాదిగ ద్వైత సంపద్గుణంబు
లలరి శ్రీ వాణి గౌరుల లక్షణముల
నుండె వెంకటలక్ష్మాంబ యుర్వియందు.

ఉ॥ ఆ యుజు జారయుఁ దరమె యాయమ సత్యము నామె
సద్గుణం। బాయమ భర్తృ సేవనము హాయిని జెందెడు
జ్ఞానగానముఁ। ఆయమ ధైర్యసంపదయు నాత్మ మెలం
గెడి పూర్ణభావమున్। ఆయమ భక్త్యపారతయు నాత్మ
విశుద్ధ మనో వికాసమున్.

క॥ శంకరు కరుణన్ జాలయ
వెంకట లక్ష్మాంబ లోకవిధమున భువిపై
పొంకమగు దంపతులకై
శంకర గౌరులను బోలి సౌఖ్యోన్నతులై.

మ॥ ఇహలోకంబునఁ బుత్రిసంతతి మది న్నిప్పించి యాదంప
తుల్ । బహుదాన వ్రత యాత్రలన్ సలిపి సుబ్రహ్మణ్య
నాగవ్రతిష్ఠ హితంబొనఁగఁజేయ నావరమునన్ జన్మించె
సర్వార్థముల్ । బహుభంగుల్ మదిఁగాంచి సంతసిలు
సుబ్రహ్మణ్య నామాత్ముఁడౌ

కృతి స మ ర్ప ణ

ఉ॥ ఏ మహనీయు పాదయుగ మెల్లప్పుడున్ మది గోరి నిత్యత
ద్ధామముఁ జెంది శాశ్వత సుతత్త్వ సుఖానుభవంబు
నొందఁగా । నీ మహి భక్తకోటి పరమేశునిఁగా భజి
యించుచుండు రామరాజు గురున్ దలంచి కృతి రత్నము
సర్పణజేతు నిత్తరిన్.

వ॥ ఈప్రకారంబుగా శ్రీగురు దేవతా స్తోత్ర వందనంబు
లాచరించి గ్రంథరచనకుఁ గడంగితి.

శ్రీ గు రు భ్యో న మః.
నాటరాగం - ఆదితాళము.

ప॥ పూర్ణాద్వైత సుబోధ దెలుపఁబడె-బుధ వరేణ్యులారా.

అ॥ పూర్ణ తత్త్వ దర్శనానుభవమును బునర్జన్మ రహిత
సౌఖ్యమొదవును ॥పూ॥

చ॥ అధ్యారోపముచేఁ జూపట్టిన అఖిల జగ జ్జీవేశ్వరులును
తమ । అధ్యాత్మ జ్ఞాన విచారణచే మిథ్యారూపంబని
దెల్పెడిఘన ॥పూ॥

చిత్త వృత్తి రహితమైన స్థితియును శివ శక్తి స్వస్వరూప
విభవము త త్త్వంపద లక్ష్యానుభవంబున తాను
తన్మ్రతయ శూన్యంబనియెడు ॥పూ॥

భాష్యత్రయ తత్త్వార్థ సారమును బ్రహ్మ విద్వరిష్ఠుల
స్వానుభవము । హేయ్య విషయ వాంఛా రహిత
సౌఖ్యమున్ । దుఃఖ రహిత భూమానందంబగు ॥పూ॥

భువిని మెట్టుపాలెమే శ్రీ పూర్ణానంద పురియై
యందున నివసించిన రామ గురుని కరుణను నిజరూపముఁ
గాను సుబ్రహ్మణ్యచే ॥పూ॥

—◆ పరబ్రహ్మ స్వరూప బోధ ◆—

కళ్యాణిరాగం – ఆదితాళం

(గణనాయక – గజరాజముఖ– అనుమాదిరి)

అద్వైత పరబ్రహ్మ స్వరూప మమనస్కభావము!
గను గానుమా॥

నిర్ద్వైత నిఖిలోపాధి వినిర్ముక్త నిత్య శుద్ధ బుద్ధముక్త
స్వప్రకాశ ॥మ॥

ఏకమై పరమై శోక రహితమై లోకాలోక జ్ఞానాతీతమై
ఘనమై॥

ఏకాంత దేశిక స్వరూపమై ఏకమేవాద్వితీయం
బ్రహ్మమైన ॥అద్వై॥

2 పంచ పంచ షడ్వింశతి తత్త్వ ప్రపంచ వాసనా రహి
తమైన నిష్ప్ర ॥
పంచ రూప మనిర్దేశ్యమై సత్యంబై యెంచిచూడ
నేమిలేక సర్వమైన ॥అద్వై॥

3 దేశ కాల వస్తు పరిచ్ఛేద రహిత దివ్యజ్ఞానా
నందానంత వినిర్మలం ॥
కాశమై ప్రణవాతీతమై జన్మ మృత్యు నాశమై
సుర ముని వర సంసేవ్యమైన ॥అద్వై॥

4 పూర్ణ రామ దేశికేంద్ర కృప గౌరి పూర్ణ సుబ్ర
హ్మణ్యుఁ డామాయబోరి ॥
పూర్ణానంద పురిలో పూర్ణ బ్రహ్మమై తా పూర్ణ
తత్త్వ స్వానుభవమున దెల్పిన ॥అద్వై॥

సూచన: — బ్రహ్మానుభవముగల మహానీయునకు మాయావృతుఁడయిన మూఢుఁడును బ్రహ్మముగా గనపడుఁ గావున నట్టి మూఢునకుఁ దత్త్వోపదేశముఁ జేయునపుడు బ్రహ్మ పర్యాయపదమగు "అమనస్క-భావ" శబ్దము సంబోధనమున నుపయోగింపఁ బడెనది. బ్రహ్మ విద్వద్వరిష్ఠుని దృష్టిలో గుణ గుణుల పారస్పరిక భేదము దూరీకృతమై యుండునుగదా!

## శ్రీ గురు ప్రార్థన

కాంభోజిరాగం — త్రి-జాల్వతాళం

ప॥ శ్రీ గురు చరణ సేవఁ జేతము-ఓ భక్తులారా-స్థిర పదంబు
జేరి యుందము.

ఆ॥ ఆగమ నిగమాంత వాక్య। స దనుభవార్థములను దెల్పి।
యోగయోగ రాగ భోగవి। రాగ తత్త్వ రూపుడయిన ॥శ్రీగు॥

1 దట్టమైన। అజ్ఞాన తిమిరంపుఁ జట్టు గొట్టి నట్టిజెట్టి। పట్ట పగటి
భాస్కరుగతిబవలు రాత్రి। యనక వెల్గు ॥శ్రీగు॥

2 ఇందు నందు నెందు జూడ। నందులేక యున్న నాడు।
బిందు కళాతీతతత్త్వ। మందు నెంద మొందఁజేయు॥శ్రీగు॥

3 స్వప్న భాతి యౌ ప్రపంచ। సకల దృశ్య మట్లడంచి!
స్వప్న జాగరము లనకను। స్వస్వరూప బోధఁ దెలుపు॥శ్రీ॥

4 మూలము లేనట్టి దాని జోలి దలచ వలదని నియమము
లొసంగు। పాలకడలి శయను స్వరూ। పాను భవార్థం
బొసంగు ॥శ్రీ॥

5 అరయ శ్రీ ప్రకాశ రామాభిధానుల గురువరు। సురచిర
చరణములఁ గొల్చు। సుబ్రహ్మణ్య నంతరాత్మ ॥శ్రీ॥

### అంతరంగ బోధ

సీ॥ గురుపాద మంత్రంబు గుదురుగా జపియించు
మానసము గిరిజ మాడ్కి నెపుడు
గురుపాద సేవను గోరి చేయుమ బుద్ధి
పవనాత్మజుని భాతి పరముఁజెంద
గురుపాద తీర్థంబు గుహుని పగిది వేగ
చిత్తమా గ్రోలి సుస్థిరత నొందు
గురుపాద రజమును శిరమున ధరియించు
మహిమ నీవు నహల్య యట్లు వెలసి

తే॥ గీ॥ నిలుపుమోజ్ఞాత! గురునాజ్ఞనియుతి నెఱిఁగి ।
మంత్ర మంత్రార్థ బోధయు మంత్రసదను
భవము నేమరకను గాంచు భావరహిత
మహా పరబ్రహ్మమా సత్య మాదువహహా.

—* శ్రీ గణపతి ప్రార్థన *—

నాటరాగం - చతురశ్రగతి

శ్రీ గణనాథం భజేహం । చిదంబర నిలయం ॥శ్రీ॥
శ్రీ గణనాథం । చిత్సుఖ బోధం । ఆగమ కళా
సింధుం - అద్వితీయాత్మ బంధుం ॥శ్రీగణ॥
1 శుక్లాంబర ధరం । శుద్ధసత్త్వాకారం
శక్రాది సురాధారం । సాధు మనో విహారం ॥శ్రీగణ॥
2 వేద వేదాంత రూపం । వివిధ విద్యా ప్రకాశం
చిద చిదానంద భూపం । సిద్ధ జన హృద్దీపం ॥శ్రీగణ॥
3 ఐశ్వర్య విద్యా నిధనం । ఆత్మ విజ్ఞాన సుధనం ॥
శాశ్వతానంత సదనం । సకల విఘ్న విదళనం ॥శ్రీగణ॥
4 పూర్ణానంద పురతోషం । పూర్ణ రామ గురువేషం ॥
పూర్ణ సుబ్రహ్మణ్య పోషం । పూర్ణతత్త్వ సంభాషం ॥శ్రీ॥

—• సరస్వతీ ప్రార్థన •—

శ్రీరాగము - రూపకతాళము.

ప॥ దేవీ! భారతీ! సదుప - దేశముఁ జేసి గావు మంబ ॥దేవి॥
అ॥ సావధానముగ నిను మది - సన్నుతింతు జగదంబా ॥
చ॥ భావమునకు నిగ్రంథము .. బ్రహ్మానందము జేయుగ
కేవల తత్త్వవచోధృతి-కృపఁ జేసి యొసంగుమమ్మ ॥దే॥

1 అజునిరాణి! అవ్యయి! యోగ్యప్రాకృతదివ్యమంగళ ॥సుజ
నానంద స్వరూపిణి!సూక్ష్మ రూపిణి! కళ్యాణి! నిజ సంగీత
సుహ్లాదిని ! నిగమ వినుత నిర్వాణిని! భజియింతు నహర్ని
శంబు।బ్రహ్మాణి! భువనేశ్వరి ॥దేవి॥

2 పరమ పురుషు లెందఱో మును । ప్రస్తుతించి స్థిరముగనీ
కరుణను ముక్తిని వడసియు చిద్ఘనరూపం బయిరిగాదె
నిరతము నెమ్మనమున నిను । నిజభక్తిని సేవించెద । వర
తత్త్వ సుఖంబులిమ్ము । పరమేశ్వరి! శారదాంబ ॥దేవి॥

3 కలిఁ గలుములొసంగు తల్లి! కలుష మడపు కల్పవల్లి
ఇల పూర్ణానందపురము । నేలుము సురుచిరతమమ్ము
నలలితముగ శాముగరుని । చరణ కమలములఁ గొలచిన
ఆల సు బ్రహ్మణ్య ప్రార్థనలనుగొని కరుణఁ బ్రోవు॥దేవి

### 7. శ్రీ దత్తాత్రేయగురుప్రార్థన

బెంగాల్ తోడిరాగం ఆదితాళము

ప॥ దయఁజూడ సమయమిదేరా! దత్తదేవా ॥దయ॥

అ॥ భయములఁ బాపి యభయము నొసంగుమ
నయమున నినుఁ జేరితిరా। నాదానందా ॥దయ॥

1 పంచభూతాది ప్రపంచ మంతయు నీవై
సంచితాదులదుంచినావురా! సత్యానంద ॥దయ॥

2 మూర్తిత్రయరూపనీ। కీర్తిని వినివిని
ఆర్తిఁ దీర్తువనితలచితిరా! ఆత్మానంద ॥దయ॥

8 అత్యనసూయాదంపతు । లమిత భక్తినివేడ
బ్రహ్మత్నం బయి వెలసినావురా! పూర్ణానంద ॥దయ॥
4 శాంతస్వరూప! సుశాశ్వతానంద ప్రద
భ్రాంతిరహితుని జేసినావురా! బ్రహ్మానంద ॥దయ॥
5 ప్రత్యగాత్ముండో శ్రీ ప్రతాపరామ గురు
సత్య చిద్ఘనరూప మీవేరా । నిత్యానంద ॥దయ॥
6 ఇల సుబ్రహ్మణ్యుని । నేమరకను బోధించు
అలహరిహర బ్రహ్మస్వరూపా! అఖిలానంద ॥దయ॥

8. —* శ్రీ మహాంజనేయ ప్రార్థన *—

హిందూస్థాని - కాఫీరాగం - జుల్వతాళం

ప॥ ఆదరించి నన్ను బ్రోవుమయ్య । ఆంజనేయ
నీదుపదాబ్జముల మదిని । నెరనమ్మితినయ్య ॥ఆద॥
అ॥ ఆదిమధ్యాంతరహిత ! ని ॥ న్నరయంగలిగెనయ్య
ద్వాదశాంతమే త్వదీయ ॥ తత్త్వ రూపమయ్య॥ ఆద॥
1 సగుణ నిర్గుణములు నీవే । సకల చరాచరములీవే
అగణితలోకాత్మలీవే ॥ అణిమాద్యష్టకమునీవే ॥
నిగమాంతా సర్వమీవే । నీకన్యము లేదు చూవే
భగవంతుండ! నగాగావవె! పరుసన! నేసీవగావే ॥అ॥
2 రామదాసవరేణ్యా! నిన్ను నమ్మినాడనయ్యా
స్వామి కార్యములం జరుపగ । సామర్థ్యుండవయ్యా
రాముని స్వస్వరూపము । వేమరు సేవించి మదిని
రామతత్త్వ మెరిగిన పరబ్రహ్మ మాదువయ్య ॥ఆద॥

3 అంజనసుత । అమరవినుత ! అప్రమేయ వేషా
మంజుల మృదు మధురభాష । మానానందభూషా
కంజభవాద్యమరమనోరంజన । రిపుశోషా !
అంజలి సర్పింతు సుబ్రహ్మణ్యనూరి భక్తపోషా ॥ఆద॥

9. —* శ్రీరామ ప్రార్థన *—

మధ్యమావతిరాగం - అటతాళం.

ప॥ శ్రీరామ జయరామ సీతాభిరామ । తారకనామ
ధామా ! దైవలలామా ॥శ్రీరా॥

అ॥ భూరిమాయను దాటలేకం । భోజగర్భాద్యమరులనుభవ
సీరధికిఁ దారకము నీపద । నీరజములనినమ్మిగొల్చిరి ॥శ్రీ॥

1 భావజ జనక ! నిర్గుణ పరమాత్ముండవని । ప్రత్యక్ష
స్వానుభవమునఁ దెలియుఘనులు చే । మావరణ విక్షేప
కర్మా । ద్యఖిలబాధల నందిపోంకక । కేవలా ద్వైతాత్మ
త్వముఁగాని । భావరహిత విముక్తతాయను ॥శ్రీరా॥

2 అయ్యా! యెంతటివాఁడవని నిన్నుఁదలతు । చయ్యన
సీతోడి సమానెవ్వరని జూతు । వెయ్యారు విధములను
నిను నా । విమలజ్ఞానాత్మగను దెలసియు । నెయ్యమున
నైక్యంబుగన మది।కయ్యమును శూన్యంబులాయెను॥శ్రీ॥

3 వాసిగ వల్లూరి వరపురమందు । భాసుర శ్రీరామ దేశి
కుఁడవై ముందు । దాసను బ్రహ్మణ్య నేలఁగ । దైవమై
యిటు లవతరించియు । వాసుదేవుని తత్త్వ మరయఁగ
జేసితివి సర్వాత్మ! సద్గురో! ॥శ్రీరామ॥

## 10. శ్రీ శివుని ప్రార్థన.

సారంగరాగం - ఆదితాళం

ప॥ శంభో ! గిరిజానాథ ! పరాత్పర ! శాంతానంద ! విలాస మహేశా! ॥శంభో॥

అ॥ అంభోజాసనాది సురనిచయార్చిత ! పద పూర్ణమాంత ప్రకాశా ॥శంభో॥

1 కాత్యాయని హృత్కమల విహారా ! ! కామహారణ కళ్యాణ సుధీరా ! నిత్యానిత్య వివేక విచారా ! నిర్మల జ్ఞానానంద శరీరా ॥శంభో॥

2 అద్వితీయ పరతత్త్వ స్వభావా ! అఖిలోపాధుండ వివేకావా ! చిద్విలాస చిదంబరదేవా ! చిరతర బ్రహ్మానంద విభవా ॥శంభో॥

3 పూర్ణానంద పురవాస ! దైవరామ సద్గురు విలాస ! సరస సుబ్రహ్మణ్యాత్మ సుపోషా ! సర్వజ్ఞానానంద విలాసా ! ॥శంభో॥

## 11. —* శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర ప్రార్థన *—

కళ్యాణిరాగం - రూపకతాళం

ప॥ శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర ! చింతదీర్చి బ్రోవుమయ్యా ॥శ్రీ॥

అ॥ వాసవాదివినుత ! కర్మ ! వాసన - రహితుంబుజేసి ॥శ్రీ॥

శ్రీ సదాశివ తత్త్వము ! భాసిలజేయుగ నెప్పుడు

జేసెదం బ్రణతు లంద్వదీయ ! చిన్మయ పదపద్మములకు ॥శ్రీ॥

1చ॥ సర్వ భూతాంతఃకరణ । సాక్షిరూపహృద్దీప
సర్వ దేవతాదిలోక । సైన్యనాయకాత్మ రూప

మి॥ నిర్వికార నిరాకార । నిష్ప్రత్యూహా ! నిరామయ
సర్వానంద పరాత్పర । సమరసైక్యజ్ఞానరత ॥శ్రీ॥

2 భీమవర పురవాస । ఉమామహేశసుత । రామగురు
స్వరూప - దోషరహిత - వల్లీ దేవసేనా సమేత
కామితార్థ ఫలదాయక । కారణ కార్యవిదారక
నీమహి సుబ్రహ్మణ్యని । నేమరకను దయచేగను ॥శ్రీ॥

—* 12. శ్రీ బాలా త్రిపురసుందరి ప్రార్థన *—

(శ్రీకర భవ్యశీలా! యను మాదిరి)

బేహాగ్ రాగం - జల్యతాళం.

ప॥ బాలా త్రిపురసుందరీ । భక్తజన హృదీశ్వరీ
పాలితాఖిలనూరి । బాలఖేలనా సుకుమారీ ॥బాలా॥

అ॥ ఏల యీదారి । చలమువిడుమునారీ । కాలకంఠురాణి
కరుణా స్వరూపిణి । కాత్యాయని! గావరావే ॥బాలా॥

1 ఆది కాదిమూలశక్తి! అపరిమితానంద భక్తి । పాదుకొన
నిన్ జేర శక్తి । బడయుదు సంపూర్ణముక్తి ॥బాలా॥

2 అందముగ నన్నాదరింపు । నందనమిడె భక్తి సొంపు
జెందను నీకృప దలంపు । హృదయ మానందమున
నింపు ॥బాలా॥

3 శ్రీ రాజరాజేశ్వరీ! శ్రీ నారాయణ సోదరీ! నారాయణి
పాపహారీ! నమ్మితి నిన్ మదినిఁ గోరీ ॥బా॥
4 సామగానలోల సుశీల । సర్వమంగళా! గుణజాల । నామ
రూప రహిత లీల । కామ కోటి శుభాంగపాల ॥బాలా॥
5 ధరణి సోపాన - నరపుర విహారిణీ గరిమ భక్త సుబ్రహ్మణ్య । నరుని బ్రోవు మహేశ్వరిణీ ॥బాలా॥

## 13. శ్రీ కృష్ణ ప్రార్థన

(నగుమోముగన లేని అనుమాదరి)

ఖరహరప్రియరాగం - ఆదితాళం

ప॥ గోపాలకృష్ణ! నిను । కోరిభజించెదరా.

అ॥ గోపీహృదయలోల । ఆపద్బాంధవ! రారా ॥గోపా॥

1 తల్లిదండ్రి గురుదైవ మెల్లరు నీవె
కల్లగాదురమ్మ గానవేగమ రారా గోపా॥
2 అలనాడా ద్రౌపది । హా! కృష్ణా! యని వేడ
వలువ లొసఁగిన శ్రీ । వాసుదేవ రారా ॥గోపా॥
3 నవనీతచోరానీ । నగు మోము జూపుమురా
భవవిమోచన నీపద । పద్మంబులఁ గొలచెదరారా॥గోపా॥
4 దర్శనమునఁ దత్త్వ । ధన్యుఁడ నైతినిరా
స్వర్ణానంద సౌఖ్యము । స్పష్టమాయెను రారా ॥గోపా॥
5 ధర చేకూరపాటి । ధామ వేణుగోపాలా
గరిమ సుబ్రహ్మణ్యుని । కరుణించిన దొర రారా ॥గో॥

## —* 14. శ్రీ గురు ధ్యానం *—

ధన్యాసిరాగం - ఆదితాళం

(మహాదేవ శంభోశంకర యను మాదిరి)

బ్రహ్మ విష్ణు మహేశ్వరులౌ పర-బ్రహ్మగురుని
సేవించరయా । బ్రహ్మ తత్త్వ సాక్షాత్కారంబు న
బ్రహ్మా నందముఁ జెందరయా ॥బ్రహ్మ॥

1 "హంస స్సోహం సోహం హంసను" అజపానుభవము
తెలియరయా । హంస లయ స్థానమౌ తత్త్వాతీతాత్మమై
యున్నది గాంచరయా ॥బ్రహ్మ॥

2 నిత్య నిర్మలాఖండ దేశికుని । నిజ సూచనమును పొంద
రయా । ప్రత్య గాత్మ పరబ్రహ్మ లొక్కటిగ । పర
తత్త్వంబై తెలియుఁడయా ॥బ్రహ్మ॥

3 ఆదిత్యాయుత తేజము మించెడి అక్షర భావము జేర
రయా । నాద బిందు కళాతీతత్వముఁగొని । నామరూప
రతి వీడరయా ॥బ్రహ్మ॥

4 సర్వం బ్రహ్మం బని బల్కెడి శ్రుతి । సాగర మజ్జన
మాడరయా । నిర్వికార నిశ్చల నిత్యాత్మను । నిర్గుణుఁడై
దర్శింపరయా ॥బ్రహ్మ॥

5 ఆశతో శ్రీ ప్రతాప రామగురు । దాసులరై పర
మొందరయా । శ్రీ సుబ్రహ్మణుని గాచిన పర । వాసు
దేవుఁడని తెలియరయా ॥బ్రహ్మ॥

15. (శ్రీ) పరమహంస పరివ్రాజకాచార్య వర్య శ్రీ శంకర
భగవత్పాదాచార్య (ప్రార్థన)

దర్బారురాగం – ఆదితాళం (నీరజనాభుని అను మాదిరి)

ప॥ పాహి శ్రీ శంకర భగవత్పాదాచార్య ! పరమాత్మ !
జగద్గురో!॥

అ॥ దేహి దేహాద్యఖిల మోహ రహిత చి। త్సోఽస్మిహం
భావాతీతానంత సుఖ మోక్ష దాయక ॥పా॥

1 అజ్ఞాన తిమిరాదిత్యావతార సత్య । విజ్ఞాన మయ పూర్ణ
సోమావతంస । ప్రజ్ఞాన లక్ష్యార్థ విపుల సత్త్వ రూప
బ్రహ్మోపేన్ద్ర శివాత్మక! దివ్యచారిత్ర ॥పాహి॥

2 మొండైన దుర్మతములను ఖండించి భూ। మండలమున
షణ్మతముల బోధించి । మండన మిశ్రాది మహామ
హుల కఖండ పూర్ణాద్వైత।జ్ఞాన మొసగిన విభో ॥పాహి

3 బ్రహ్మసూత్ర గీతోపనిష ద్భాష్యాదుల । వ్యాఖ్యాతవై
సర్వాత్మ ధర్మముల । బ్రాహ్మణాది సకల। వర్ణములవారి
కహ రహమును । తెల్పిన హరి హర వర రూప ॥పాహి॥

4 భువి శ్రీ పూర్ణానంద । పుర సాధు జన పాల। పూర్ణాత్మ
రామగురు స్వస్వరూప । భవ బంధ కర్మ నిర్మూలన
కారణాచార్య।భక్త సుబ్రహ్మణ్యవరద! హే శ్రీగురో!॥పా॥

## 16 బెంగాల్ తోడిరాగం - రూపకతాళం

(వీర రాఘవా ఆనుపోల్కి -)

శ్రీ గురు కరుణ నిజ-చిత్తమునఁ దెలియ నాగమాంత
మున నున్న హాయి యానామోగా ॥శ్రీగురు॥

1 ఉన్నది తెలియ మును - పున్న దేమోగా
ఉన్నది లేదన్నది తా - నున్న దామోగా ॥శ్రీ॥

2 పూర్వ మందున వట్టి పుణ్యమునకునై । ఊర్ణనాభి కరణి
నొకఁడు వచ్చి బోయెగా ॥శ్రీగు॥

3 ప్రకృతి పురుషుల రెంటి బడయుని దేగో ।
వికృతి నొంద నెప్పటి కొక విధమై యుండెగా ॥శ్రీగు॥

4 ప్రజ్ఞావంతుఁడై తుదకు బ్రకృతి ద్వయమును
విజ్ఞానాత్మత విడిన విభులుఁ డౌనుగా ॥శ్రీగు॥

5 రామగురు మహారాజ రాజుఁ జేరిన ।
నీమమున సుబ్రహ్మణ్యుఁడు నిత్యుఁడాయెగా ॥శ్రీగు॥

## 17 బేహాగ్ రాగం - అట

స్వస్వరూప స్వానుభవ మొందవలెరా ।
ఏ స్వానుభవమైన నీ స్వరూపమేరా ॥స్వ॥

1 నిర్వ్యాచార జీవనము చేయవలెరా ।
సర్వసాక్షి యునఁ దన సరణియై యుండెరా ॥స్వ॥

2 పసిబాలు భావాగ్రహతు నియమి గనరా ।
అసి పదాంతమే స్వసుఖ మాయెనురా ॥స్వ॥

3 బాహ్యాంతర దృశ్య । పధము నిజము లేరా ।
గుహ్యాతి గుహ్య గురు శాస్త్ర మాయెనురా ॥స్వ॥

4 అహం రహిత నిష్ఠ । ఆత్మ యాయెనురా ।
ఆత్మాతీతమైన । అనుభవము గనరా ॥స్వ॥

5 శ్రీ రామగురు చరణ । సేవఁ జేయుమురా ।
శివ సుబ్రహ్మణ్య శాశ్వత సుఖ మదేరా ॥స్వ॥

## 18 హిందూస్థాని జంఝూటీరాగం - ఆదితాళము

(మంగళమో హరి మంగళమోహరి అనురీతి)

పరశివ స్వ స్వరూపము దెలియగ లేని । నరుఁడు గురుం
డగునా? పామరుఁడె గాని । నరుఁడు గురుం డగునా ॥పర॥

1 తన సౌఖ్యంబును తను నెఱుఁగకను । ఇతరులకు సుఖ
మిడునా । ఈ భువిలో నితరులకు సుఖమిడునా ॥పర॥

2 వాక్యార్థానుభవము నెఱుఁగని వా । డైక్యభావము జెం
దునా । పండితుఁడైన । ఐక్యభావముఁ జెందునా ॥పర॥

3 లక్ష్యాలక్ష్య విలక్ష్య మెఱుఁగనివా । డక్షరాతీతంబౌనా ।
దీక్షితుఁడైన అక్షరాతీతం బౌనా ॥పర॥

4 మాటి మాడిపై చింతను వాకి లెఱుఁగక ముక్తి సుఖము

జెందునా! ముని వేషము దాల్చిన ముక్తి సుఖముఁ జెం
దునా ॥పరశివ॥

5 వర దుద్దుకూరి పుర । హరి హాహా కరుణను । గురు
తత్త్వమై తానుండెగా । సుబ్రహ్మణ్యుఁడు గురు తత్త్వమై
తానుండెగా ॥పరశివ॥

19 నాదనామక్రియ – ఝంపతాళం

(విన రానదానంద యోగి – అనుష్టుప్పు)

తత్త్వ బోధను మదిని విచారించుము – తాత్పర్య
వైరాగ్యపరతి గొనుమీ ॥త॥
తత్త్వమహాదిది మహావాక్య లక్ష్యార్థ – తత్త్వాను
భవమైన తానె సర్వంబాయె ॥త॥

1 మూడు లోకముల ప్రపంచమును నే । నాడు తాఁ బ్రకాశింప
జేసెనో । వాడె నేనని తెలియఁగను । అట్టివాని సర్వ
బంధములు వీడిపోను ॥త॥

2 తన నిజ స్వరూపముగ విన్న । బుద్ధ్యాది తత్త్వసంబాధము
లేదో యున్న ॥ గగన సంద్రజాలము సున్న । దాని కని
భ్రమించ కుంట । ఘనమౌ మాయున్న ॥త॥

3 కార్యకుండు సుషుప్త్యాదులందు – యేమి కానరాదని సాక్షిగా
గనుచు నుండు – కార్యకుండు సంకేనాశుండు గాన కార్య
కారణ రహిత ఘనమై నీవుండుము ॥త॥

4 ధర శ్రీపూర్ణానంద పురిని - పరం ధాముఁడౌ శ్రీ రామ
దేశికేన్ద్రుని । చరణ సరసిజముల మదిని । గొలచి
స్వ స్వరూపంబైన సుబ్రహ్మణ్యుని ॥అ॥

20 ఆనంద భైరవి - ఆదితాళం

(నిలచి మాట్లాడవు అను మాదిరి)

అశరీరి దివ్యానుభవ మగయ శిక్ష్యఁడుగాఁడు ॥అ॥
విశదమా వారు శ్రీ పశుపతి స్వ స్వరూపము బోధ ॥అశ॥

1 బ్రహ్మ మాయలనెడి - పలుకుల భావమాయె ।
సింహ మత్తేభములకు - స్నేహ మొదవినటులాయె ॥అ॥

2 ప్రారబ్ధ దేహములనే - భావ మబద్ధమాయె ॥
చేరి కర్పూర దీప - స్థితి చతేమి లేదాయె ॥అశ॥

3 చిద్గగనాంతమును శ్రీరామ గురు కృపను ॥
హృద్గేయమునఁ గొని - యెడు సుబ్రహ్మణ్యుఁడౌ ॥అశ॥

21 కాంభోజిరాగం - అటతాళం.

(ఎటులైన భక్తి హెచ్చుటకే అనుమాదిరి)

ప॥ ఎటులైన నొకటైయున్నదిరా - యేమనరాదురా
యేమియుఁగాదురా ॥ఎ॥

అ॥ పటుతరాద్వైత పూర్ణానుభవంబైన । భా
వాభాతీత పరతత్వమై యున్న ॥ఎటు

1 సగుణ నిర్గుణ మనరాదు । సర్వసాక్షి దానని బలుకఁబోదు
నిగమాంత వాక్యార్థ నియతి దానై తెలియు । భగవత్స్వ
రూపమా । పరమాత్మానుభవ ॥మెటు॥

2 సత్యా సత్యాతీతమైన । సమర సైక్యజ్ఞానాను భవమన ।
చిత్తవృత్తులుగావు । చింత లనతే లేవు । అత్యంతానంద
పరాత్పరమై యున్న ॥మెటు॥

3 జగజ్జీవేశ్వరులన గావు । జనన మరణము లనఁ గన లేవు
అగణితమై యున్న । ఆత్మాతీతంబైన । యవాఙ్మానస
మైనట్టి । యనుభవ పరునకు ॥మెటు॥

4 బాగా శ్రీ సోపానపురిని । పరబ్రహ్మమా శ్రీరామ గురుని
నాగమాంతరీత్యా । యర్చించు శ్రీసుబ్ర । హ్మణ్య నిజ
రూపమా । మహనీయ గురు తత్త్వ ॥మెటు॥

22 సౌరాష్ట్రరాగం - ఆదితాళం
(రామామధురానగరీరమ్యా - అనుమాదిరి)

శ్రీ గురు కరుణామృత రస - చిద్ఘనానంద విలాసము
రోగాతీత చిదాకాశాంతము - రాగరహితుడై తెలియ
నానయ్యా ॥శ్రీగురు॥

1 అనుభవమే మాం । బయున్నది । అసందాతీతమైనది ।తనను
దా గుర్తిలుగఁ గున్నది । తత్పద త్వంపద రహితమైనది॥

2 విక్షేపావరణాలు లేక - సాక్షినవక సర్వము దానై పూర్వ
పక్ష సిద్ధాంతములందక ప్రత్యక్ష స్వానుభవమైయున్నది॥

3 ఉన్నదున్నట్లుగా ప్రస్ఫుతి విశ్వ ముంచి జీవేశ్వరానుభవ ।
మున్నట్లు స్వప్నమ్ము మేలుకొంచగా నున్నట్టి దైనదని
దెల్పుచున్న ॥శ్రీ॥

4 ధరను శ్రీ సోపాన నగర ధామముతో శ్రీరామ సద్గురుని
నిరతమును గొల్చు సుబ్రహ్మణ్య । నిజరూపానుభవ
మొసంగిన ॥శ్రీ॥

28 కాంభోజిరాగం – ఆదితాళం
(భళిరా వైరాగ్యమెంతో అనుతిరి)

భళిరా! పరతత్త్వానుభవమె భాగ్యమున్నదిరా ॥భ॥
మెలకువలో మెలకువ గలవారికే మేలై యున్నదిరా ॥భ॥

1 నిరుపమాన నిరవయ నిర్మల ఘననిశ్చల మైనదిరా ॥
హరిహర బ్రహ్మాదుల కాద్యంతమైయుంటేట యున్నదిరా ॥భ

2 వాక్య చతుష్టయ బోధాంతమె శక్తివల్యమదో గనరా ।
ఐక్యమౌ ననెడి వాక్యవిచారణ కందక యున్నదిరా ॥భ

3 దశమియు నేకాదశి గడచిన ద్వాదశి యుదయోగను గానరా ॥భ
దశవిధా కాశముల కావల పరమశమై యున్నదిరా ।భ।

4 ఆలయముల పీఠిక మను వారల కందీ యుండదురా ॥
ఏలయమై సర్వంబైన దదో! యేమర కుండుమురా ।భ॥

5 వే మూర్వేంకట కృష్ణ దాసుకది వేల్పై యున్నదిరా
స్వామి సుబ్రహ్మణ్యునకనవరతము స్వానుభవంబదిరా ॥భ

6 ధర శ్రీపూర్ణానంద పుర పరంధామంబైనదిరా ।
నరదుడైన శ్రీరామ గురు స్వరూపంబై యున్నదిరా ॥ధ॥

## 24 సురటరాగం - ఆదితాళము.

విరోధమేలేదు - మొందున - విరోధమే లేదు॥ పరా నరిని
సర్వజ్ఞుని భావము । స్వ స్వరూప స్వానుభవ మొందగ॥వి॥

1 తనయందుఁ గలుగు భ్రాన్తి జనిత దుఃఖము । తనను
విచారింపమిచే యుండెను । మనమటు నష్టాని వీడవలెనన
ఘన విజ్ఞానామృతము గ్రోల భువి ॥వి॥

2 దాని కదియె యాధారమయ్యె । తనలోనె తా ననుభవ
మొందగను । అనవరతము తా వేరుగా దనెడి ఆత్మ
విచారణఁ జేయుచునునకు ॥వి॥

3 సర్వంబున నున్నదంత తానై । గర్వ మనుచు నెంచక
వీక్షించిన । సర్వం బ్రహ్మం బను శ్రుతి రీత్యా ॥వి॥

4 పూర్ణానంద వర పురంబున - పూర్ణుడైన శ్రీరామ
సద్గురుని । పూర్ణానుభవాతీతుడైన నా । పూర్ణ సుబ్ర
హ్మణ్యున కెల్లప్పుడు ॥వి॥

## 25 ముఖారిరాగం - ఆదితాళం

(పాలోయమ్మ పాలు అనుమాదిరి)

పండ్లోయమ్మ పండ్లు పరదేశికుడొసగిన ॥పం॥
పండ్లు పండి పరిపక్వమై పరమ భాగవతుల భావంబై
యుండిన ॥పం

1 సత్సాంగత్య స్వానుభవంబును సమరస్సైక్య జ్ఞానార్ధ
రసముగల ॥పం॥

2 ఆత్మా నాత్మ విచారణ యను ఘన । స్వాత్మానంద
ప్రకాశ రూపమగు ॥పం॥

3 ఐహి కాముష్మిక సుఖాదులకుఁదా । ననంగాత్ముఁ డని
యొదు మల్గోవా ॥పం॥

4 స్వ స్వరూప సాక్షాత్కారంబను । స్వ ప్రకా
శమైన - అంటుమామిడి ॥పం॥

5 ఎఱిఁగి యొఱుఁగ నట్టులున్న భ్రాంతిని
మఱుపుఁ జేయు మాయిమా పసందను ॥పం॥

6 పూర్ణముగా సుప్తు కరణి సంసా
రార్ణవమును దాటించు బహంగీర్ ॥పం॥

7 సర్వవస్తు స్వ స్వరూప పూర్ణ । స్వానుభవాద్వై
తంబగు నాజూక్ బడన్ ॥పం॥

8 రామగురు పదాంబుజ సేవక సు ।
బ్రహ్మణ్యుని నిత్యానుభవంబును ॥పం॥

## 26 మేలుకొలుపు - భూపాలరాగం - ఆటతాళం

( ప్రభాత సేవ )

మేలుకొనవే స్వస్వరూపమ! మేలుకొనవే సహజరూపమ!
మేలుకొను స్వానుభవమొందఁగ । మేలుకొనునీవే ॥మే॥

1 కానిదేమూ లేనిదాయెను । కార్య కారణ మేమి యా
యెను।జ్ఞాన జ్ఞేయము లెల్లఁ దెలియఁగ।బానె యాయెన్ ॥మే

2 నిదుర లోపల నిదుర మేల్కొని । నిదురగాని నిదుర
బోయెద । వదిలె సుఖమనియుండఁ దగునా । అదియె
యిదియాయెన్ ॥మే॥

3 స్వ స్వరూపం బెల్ల నగుదువు । సకల నిగమాంతముల
రీత్యా।సుస్వరముఁ బాడుచును ఆడెడిచోటు నీవేలుఁగన్

4 నిన్ను నీవు జూచి వెలుపున। నిర్వికల్పుని నతుగ నుండెడు
ఉన్న దేమి యున్న దనుకొని। యుండితివి యిటులన్ ॥మే॥

5 కర్మ ధర్మము లెల్లఁ జూడఁగ । గడచి మిగిలిన దేమి॥
యా యెను। నిర్మలంబై యున్న దెల్లను। నీవె యాయెన్॥మే॥

6 ధరను పూర్ణానంద పురమున। ధాముతో శ్రీరామ సద్గురు
పరమ రహస్యము సుబ్రహ్మణ్యన। కిరవుతా నాయెన్॥మే।

27 శహాన రాగం - అటతాళం

(ప్రొద్దు ప్రొద్దున లేచి పొడగంటి రంగని-అనుభూదిరి)

ప॥ ప్రొద్దు ప్రొద్దున లేచి । పొడగంటి సద్గురు ముద్దు పద
ములను ప్ర।మోదాత్ముఁడగు మనే ॥ప్రొ॥

అ॥ నిర్గంపుటగ్గమును బోలిన । నిర్వికారాద్వైత మనమటు
సద్గురుసేయుర।స్వస్వరూప।స్వానుభవ।సామ్రాజ్యమందఁగ॥ప్రొ॥

1 శివజీవైక్యమున । శివుఁడుదానైగనిన । శివతత్త్వాతీత పర
శివలోకరూపము । శివజీవ జగములనరాని చిన్మాత్ర

రహితమని । సర్వము । భావింపు భావంబు వీడఁగ ।
బ్రహ్మోపదేశికుఁడన్న నే ॥పా॥

2 రానిపోనిది తెలిసి - రాని పోనిదివిడిచి .. లేని పోనిదాని
లేక యుండఁగఁజూచి - శ్రీనివాసుని రూపమంతట - చేరి
కన్గొని సర్వవిభులను - పూనితిత్త్వాతీత మనుచును
పూర్ణబ్రహ్మానంద మొందియు ॥పా॥

3 ఒకయొకట్ల యొకటని - యొప్పుగానువిని .. సకలము
రెండు రెండ్ల - సంపూర్ణమగు - బలికి - ప్రకటముగ
నారారిటిని నా - పరమ పదమునఁ జూచి - యంగ్నపై
సకల సంఖ్యల నొక్క రీతిగ - సరిజూచి - స్వానుభవ
మొందియు ॥పా॥

4 శ్రీశైలశిఖరమున । శ్రీనివాసునిగని । శేష శైలాంతము ।
శివు నివాసమని । దేశికుని కృపచే । దలిసి బహు । దేశము
దైవముల । జ్ఞానాకాశమున । బరతత్త్వ మనినే । నేకం
బైన హృదయమున । గాంచియు ॥పా॥

4 వసుధ పూర్ణానంద । వర పుర నిలయులౌ । అని పదాంత
శ్రీరా । మాత్మ దేశికుచరణ । వసతిఁజేరిన । సుబ్రహ్మ
ణ్యుని । వాంఛితార్థములెల్ల సఫలం । పై సకల చిద్రూప
బృందముల్ । హాయిఁజెంది ప్రశాంతి నొందగ ॥పా॥

28 బేహాగ్ రాగం - ఆట తాళం.

(పెండ్లి పెద్దలు మీరుగండి - అనుకీతి)

పరిపూర్ణ బ్రహ్మను భవము - పరమపదము
జెందిన బ్రహ్మజ్ఞానుల ధనము ॥ప॥

నిరుపమానందమె గొనుము – "సర్వ – పరిపూర్ణోహమేవ" యను శ్రుతిగనుము ॥ప॥

1 ద్వయదోషముల త్యాగమునను – అ – ద్వయ బ్రహ్మ బోధప్రజ్ఞను మదిగొనుము భయ రాగ క్రోధాదుల్విడుము "బ్రహ్మవేద బ్రహ్మైవభవతి"ను శ్రుతితానేను ॥ప॥

2 అశరీర మనునది లేదు – తా – సశరీరుండనుట కనతే నిలువబోదు । విశదముగన మొదలె లేదు – సర్వ – దిశలై యున్నది తానైనను రాదు పోదు ॥ప॥

3 తీరిపోయిన పత్రమాయె – తా–తీరునసున్న – నిత్యానంద మాయె – కోరినదంత తానాయె – తిరిగి – కోరుటకన్య మింకొకటిలేదాయె ॥ప॥

4 ఏకాలమున నెచటనైన – తనకు – నెటులుండి – యేమి – ప్రాప్తించినదాన – నేకోశమున భ్రాంతిపడునా – పడదు యేవాసనలు – మనమునకు లేని కతన ॥ప॥

5 అరయ పూర్ణానంద పురము – సుబ్రహ్మణ్య నేలిన రామ గురుడుండె స్థలము – నిరత నిజభక్త సేవనము – గలుగ నిత్యానంద సద్యోముక్తిదాయకము ॥ప॥

29 భాగేశ్వరి రాగం – ఆదితాళం

(ఆటలాడు కోరా – అనుపాడిరి)

స్వానుభవానందము గొనరండి – సర్వజ్ఞులైన భ్రమవిడు

నడచి - జ్ఞాన పథమునకు నీ - నాసంగుతెంచి - స్వామి సన్నిధానము జేరండి ॥స్వా॥

1 ఈకనంబడు నామరూప జగము మునుపెందుండె యిపుడు। వచ్చెనో - సృష్టికి - నేకమై ప్రళయ మందెందున లయ మెటులనొ నా - దెలియుండి రహస్యము ॥స్వా॥

2 సృష్టికిఁ బూర్వము నామ రూప వి। శేషరహిత బ్రహ్మంబై సహజ ॥ స్వస్వానుభవంబునఁ బానే యీ । ద్రష్టృ దృశ్యదర్శనములఁ దోచెను ॥స్వా॥

3 భ్రాంతివలన ద్రష్టదౌ యీ దృశ్యము । స్వాంతమున జగజ్జీవేశ్వరులని । చింతించియు భ్రాంతిపిసఁగా పర శాంతినొంది సహజంబయి యుండిన ॥స్వా॥

4 స్వస్వరూప బోధ దర్శనము । శ్రీ సద్గురుస్వామి కృపచేఁ గనుఁగొన । దుస్స్వభావ వాసనా వృత్తుల మది । తొలఁగించి నిత్య సుఖమొనఁగూర్చెడు ॥స్వా॥

5 సర్వము బ్రహ్మాకారముగాఁ గన । స్వాత్మకన్యముగ లేదొకటి యంత ॥ సర్వము సహజంబుగ తన యందున ॥ జరుగుచుండ నేకంబైయుండెడి ॥స్వా॥

"శ్రుతిః-మయ్యేవ సకలం జాతం । మయి
సర్వం ప్రతిష్ఠితం - మయి సర్వంలయం యాతి
తద్బ్రహ్మాద్వయ మస్మ్యహం" కైవ.

6 ద్వంద్వాతీతుండైనగాని యా - తత్స్వరూపమయి

యుండడుగద - నిర్వంద్వం బై యుంతటనుండిన యా
ద్వైత శూన్యన కథుంబులు మాన్పడి ॥స్వా॥

"శ్రుతి:- ఉభేవిద్యాక్ పుణ్యపాపే - విహాయ నిరంజనః
పరమం సామ్యముపైతి"

7 బ్రహ్మనిష్ఠ పట్టుచుటచే సనసానము - భ్రాంతి జనిత
దేహంబుగాదు మఱి బ్రహ్మత త్వ సద్బోధమవునా-
భ్రాంతిజనిత - జన్మాదులుపోవు ॥స్వా॥

"ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం - న క ర్తవ్యః
కదాచన - ప్రమాదో మృత్యురిత్యాహు -
ర్విద్యాయాం బ్రహ్మ వేదినః"

8 బ్రహ్మనిష్ఠ మఱువకుండగా సు-బ్రహ్మజ్ఞాన శాశ్వతస్సులు
రాము - బ్రహ్మ గురుడౌనంగగాను వేగాని - ప్రణతు
లొనరగి సంతసమునఁ జెప్పిన ॥స్వా॥

30 కేదారగౌళరాగం - ఆదితాళం

రాదు గురుచరణము గొల్వుమా - ఓమనసా- నీ రాగ
ద్వేషములోభ ముల విడువుమా - నామరూపగుణములాది -
సటన లేమి లేక నిత్య - భూమపదాతీత పరి - పూర్ణ
త త్వ మొందెదవు ప్తి ॥రా॥

1 విషయవిరాగమును బొందుమా - ఓమనసా! యీ-మృష
ప్రపంచమును జేరనీమా- విషము విషముగాదు మఱియు
విషయ వాంఛయగు విషంబు । విషయ రహితమైన బ్రహ్మ
విద్యవిహితముగను జెంది ॥రా॥

2 ఆత్మనిష్ఠ వదలకుండుమా ! ఓమనసా ! సర్వాత్మరూప
మయితివిసుమా ! స్వాత్మబోధ సుధను గ్రోలి - సర్వాతీత
మైన పూ - ర్ణాత్మ తత్త్వమై యంతట ననుభవమై
యున్నదనిశ్రీ ॥రా॥

3 జీవ కారుణ్యము వలంచుమా - ఓ మనసా - ఆ - జీవులే
చిదాత్మయౌ సుమా - కేవలాత్మరూపముగన శివజీవు
లనంగ లేరు ఏవిధమునఁజూడ సర్వ - మేకమై యాలరారు
చుండు ॥రా॥

4 పరమ శాంతినొందియుండుమా - ఓమనసా । పర బ్రహ్మ
మున ప్రకృతి లేదుసుమా । పరిపూర్ణాద్వైత సహజ - పర
మాత్మానుభవముగని - నిరతము వాఙ్మనస గోచరుండై
నిఖిలమైయుండి ॥రా॥

31 రాగం - ఆదితాళం (కృతి)

(యదుకుల భూషణా అనురీతి)

నిజగురు చరణములే భజింతున్ - నిజగురుచరణములే॥
ఆ జగదీశునకే - ఏ-ఏ-ఏ నానతులర్పింతునుగా ।ని
రామదేశిక కటాక్షమునన్ పర - బ్రహ్మమునే మనమార
గాంచి - రక్షణఁబొందితిగా ॥ని॥

32 హిందూస్థానిరాగం - ఆదితాళం.

శ్రీదత్తగురు దివ్య చిన్మయరూపము-సేవింపఁగలిగెరండో

సిద్ధులారా! సిద్ధులారా యోగప్రసిద్ధులారా – జ్ఞాన వృద్ధులారా – పరమబుద్ధులారా ॥శ్రీ॥

1 అవధూత వేషుండై – అవతరించియు మన – భవముల నెడఁబాపు – భక్తులారా భక్తులారా యోగ – రక్తులారా జ్ఞాన – సక్తులారా – శాశ్వత ముక్తులారా ॥శ్రీ

2 అత్ర్యనసూయాత్మజుండై–అవనిసురుల బ్రోవ చిత్ర చారిత్రుండయ్యె మిత్రులారా – మిత్రులారా యోగ – గాత్రులారా జ్ఞాన క – ళత్రులారా గురుపుత్రులారా ॥శ్రీ

3 ధరపూర్ణానంద పురధాముఁడౌ – రామగురు – నిరుపమానందము గానుఁడో! నిత్యులారా – నిత్యులారా యోగ – కృత్యులారా జ్ఞాన–ప్రత్యగభిన్నాత్మ బోధాదిత్యులారా ॥శ్రీ॥

## —* 33. శ్రీ దత్తాత్రేయ లఘుమానస పూజ *—

సీ॥ ధ్యానంబుఁ జేతు శ్రీ ♦ దత్తయోగివరేణ్య
ఆవాహనముఁ జేతు ♦ దేవ దేవ
చిత్తాబ్జ మనుదివ్య ♦ సింహాసనంబిదొ
త్రిపుటిపాద్యముగొను ♦ త్రిగుణరహిత
అఖిలాత్మ! శుద్ధోద ♦ కార్ఘ్యంబు గైకొను
మాత్మబోధజలము ♦ నాచమించు
పంచకోశాత్మలన్ ♦ పంచామృతంబుల
నభిషేకముఁ గొను ♦ మమలచరిత

తే॥ గీ॥ సచ్చిదానంద జలమున • స్నానమాడి
వాసనాత్రయ రహితమౌ • వస్త్రధార
ణమును విశ్వాత్మ యజ్ఞసూ • త్రమును గొనియు
శాశ్వత బ్రహ్మతత్త్వమౌ • మంగమిమ్ము.

34. బేహాగ్ రాగం – ఆదితాళం.

ద త్తదేవా! మమ్ము బ్రోవ – చిత్తగింపుమా
అర్చనలగా ॥ద

ఉత్తమాంగత్రయ ప్రపూర్వ స్వత్రిరూప సుతత్త్వనైవేద్య॥ద

1 అత్తరు పన్నీరు మంచి – అగరు జవ్వాజి కర్పూర –
తత్త్వమౌ శ్రీగంధములివిగో – సత్వగుణరూపం గొనవే॥ద

2 మల్లెలు మొల్లలు తులసీ . మంచి విరజాజిపువ్వుల్ –
కొల్లలుగ నర్పింతుని టె నే – కోరి విశాలదంబులను శ్రీ॥ద

3 అగ్నిగాని యగ్నిరియౌ జల – రాగ్నిపాత్ర రూపవమౌ
పం – వాగ్నులందున వాసనలనే – సాంబ్రాణి ధూపం
బర్పింతుగా ॥ద

4 చిత్కళలు తేజంబుగిడగా చిన్మయా తాత్రితిమగా గని
సత్కరించెద దీపహారతుల్ – సంతయాత్మ తమంబు
వీడగా ॥ద

5 పంచ భక్ష్య పక్వాన్న ఫలములో – బహువిధోప హార
ములు గా . వించిన యమృతమహా న్నై – వేద్య మర్పణ
జేతుగొనుమిదే ॥ద

6 పండుటాకులచే సమర్చిన - పరిమళ ద్రవ్యముల వీడెము
దండి వాంఛలెల్ల వీడియు దయకు పాత్రుడనై యిచ్చెద
గొను ॥ద॥

7 పచ్చకర్పూర నీరాజన - మిచ్చి రవి చంద్రాగ్నిజ్యోతుల
హెచ్చుగా నానంద హారతు - లిచ్చి మంత్రపుష్ప
మిడుదు ॥ద

8 ధరసుపూర్ణానంద పురమున - ధాముతో శ్రీరామ గురు
వరు - స్మరణఁజేయు సుబ్రహ్మణ్యుఁడు - సమర్పించె
సాష్టాంగనతులన్ ॥ద॥

౩౫. శ్రీ ద త్త మం గ ళ హా ర తి

కేరళ-ఝంఝూటిరాగం - ఆదితాళం

(మంగళ మోహారి - అనుమాదిరి)

ఉత్తర నీ రాజన మొసఁగెద - శ్రీగురు దత్తాత్రేయా!
గొనుమా - శ్రీగురుదేవదత్తాత్రేయా! గొనుమా ॥ఉ॥

1 పచ్చలు దాపిన పయిడిపళ్లెరమున - పచ్చకర్పూర హారతి
సచ్చిదాత్మ! గొనుమా! పచ్చకర్పూర హారతి ॥ఉ॥

2 అకలంక పరిపూర్ణా ద్వైతస్వప్రకాశ .. మకరత మణుల
హారతి-మహాత్మా! గొనుమా! మకరత మణులహారతి ॥ఉ

3 ధరసోపాన పురధాముతో ప్రతాపరామ - గురుస్వరూప
మీవె సుబ్రహ్మణ్యునిబ్రోవ-గురు స్వరూపమీవెగా ॥ఉ॥

## 36. ప్ర శాం త భ క్తి

జంగాల తోడి - జంపెతాళం

ప్రశాంతభక్తి యొసంగుమా భద్రగిరి రామ ॥ప॥
సాకార రూపమున సందర్శన మొసంగి ॥ప॥

1 నీ సేవకై తనువు - నిలిచియున్నది రామ -
గాసిబెట్టక వేగ - కరుణించి త్వత్పాద ॥ప॥

2 ఇతర చింతలు లేక । నెప్పుడును నీ గోల చెనసు
సతత మాత్మను తత్త్వ । సామ్రాజ్య మొసంగినా ॥ప॥

3 పరిపూర్ణుడవని నిన్ను । బ్రహ్మమను లసు దెలిసి ।
నిరుపమానందాత్మ । నిత్యసుఖమును నొంది ॥ప్రశాం॥

4 శ్రీరామ దేశికుని । శిష్యగాని సంసారులకు
తారక బ్రహ్మ నిన్ను । దర్శించితిని నా లో ॥ప్రశాం॥

5 భక్త సుబ్రహ్మణ్య । భావరహితాత్మ నీ
శక్తి యొసగియుం బ్రోవ । సమయమిదే సర్వాత్మా ॥ప

## —* 37. జ్ఞా న బో ధ ప ద్య ము లు *—

తే॥ గీ॥ విషయ వైరాగ్యమొందియు । నినుఁబలుకుదయ్యు
బ్రహ్మనిష్ఠను జేయుచు । భ్రాంతిరహిత
తత్త్వ సామ్రాజ్యమున శాంతి । దాల్చి పరమ
జీవ కారుణ్యమున గాంచు శ్రేష్ఠులయు.

తే॥ గీ॥ నీవు తప్పును జేయక । నిలిచి నేని
నీకు భయమన్నటికి లేదు । నిర్మలాత్మ

ఆ॥ వె॥ అట్టివారు దొరకు । టరుదు జగంబున
దొరికెనేని వారి । త్రోవ యెఱిఁగి
నడుచు భక్తులున్న । నది తత్త్వమౌనట్లు
గాకయున్న నగును ॥ లోకహాని.

గీ॥ కాన పరిపూర్ణ బ్రహ్మాత్ము । లైనవారి
సేవలొనరించు నాఘనుల్ । చిత్తమందు
సాధన చతుష్టయంబును । సత్యముగను
ననుభవంబున నెఱుగుదు । రాత్మవిధిగ.

46 తోడిరాగం — అటతాళం

(స్వామి నీనగుమోము — అనురీతి)

ఆరురుక్షువు లమల విజ్ఞ — సాత్మ సాధన
సంపదలు మదినందుడీ — బ్రహ్మముఁ బొందుడీ ॥ఆ॥

1 బ్రహ్మ నిత్యము భ్రాంతి యనిత్యము । భావమునఁ జగ
ద్బుద్ధి విడుట వివేకము లోకము శోకము ॥ఆ॥

2 ఐహికాముష్మిక ఫలంబుల । యందుఁ గోర్కెలు వీడుట
వైరాగ్యము । అదియె మహాభాగ్యము ॥ఆ॥

3 బాహ్యేంద్రియ విషయములపై । భావమిమడకుండ
లక్ష్యముగాంచుడీ శమమిదె యెంచుడీ ॥ఆ॥

4 ఈశ్వరానుభవమగు సృష్టిని । నెపుడు మనమున జీవ
కల్పనఁ జేయుకు దత్త్వము మదువఁబోకు ॥ఆ॥

5 సతతమును సత్యమును జూచుచు । మదినన్యము నెఱుగ
కుండుట । యుపరతి । చెడును జగద్రతి ॥ఆ॥

6 ఆత్మ నిష్ఠనుండి ద్వంద్వము । లంటకను సహానంబు
పొంద । తితిక్షయా । సది సద్దీక్షయా ॥ఆ॥

7 శాస్త్ర గురు దైవము లందు । వి-శ్వాసమున
సేవించి నడచుట శ్రద్ధయా । జ్ఞాన వివృద్ధియాం ॥ఆ॥

8 సర్వ కాలములందు బుద్ధిని । సత్తునందుం చుటయె
సుసమాధానము । యగు నాత్మ సంధానము॥ఆ॥

9 బంధముల్వీడి స్వస్వరూప । భావమున మోక్షాపేక్షను
జెందుఁడి । అది తా ముముక్షుఁడీ ॥ఆ॥

10 ఇట్టి యధికారుండె గురువరు। నెఱిఁగి బ్రహ్మము తానౌను
ఇదిసత్యము । అన్య మనిత్యము ॥ఆ॥

11 రామగురువరు కృపనడసి సు । బ్రహ్మణ్యుఁడది తానవై
ఇటుఁజెప్పెను । తమమది చెప్పెను ॥ఆ॥

### 47. పూర్వీకల్యాణిరాగం – రూపకతాళం

శరణు శరణు రామచంద్ర । శరణు-ఇనకులాబ్ధిచంద్ర
శరణు సన్నుతామరేంద్ర । శరణు త్రిజగద్దేశికేంద్ర ॥శ॥

1 సత్యజ్ఞానానంద రూప ! సకలసాధుజన హృద్దీప।ప్రత్యగ
భిన్నాత్మ ! శ్రీపరాత్పర । శమితాత్మతాప ॥శ॥

2 సకలచరాచర వర । సర్వసాక్షి ప్రకృతిదూర । ప్రకటిత పరిణామాత్మధీర । భవ విరహితజ్ఞానాకార ॥శ్రీ॥

4 భక్తకరుణాలవాల । పాలితాఖిల లోకజాల । భక్తసుబ్రహ్మణ్యపాల । ప్రమోదాత్మసత్యశీల ॥శ్రీ॥

—* 43. శ్రీ గు రు మం గ ళ హా ర తి *—

మధ్యమావతి రాగం – ఆదితాళం.

(నీలకంఠున శివ గే – అనుమానగిరి)

రామసద్గురున కివరే । రత్నాలహారతి ॥రా॥

వామాంకమున సీతాక్ష । శ్రీమహాలక్ష్మి నాగయు శ్రీమించు పంచామృతమాలె । సేవించు తనయుల ప్రతాప ॥రా॥

1 దశవిధ మంత్రములు । దనరిన వాడే రాజు శశిసూర్యాగ్ని నేత్రములు । గల్గిన వాడే । దశవిధనాదామోన తత్వార్థమరయు పంచ । దశ భావనామొసని ద్వా । దశభావమైన దశరథ ॥రా॥

2 ప్రణవాంతరూపమున ప్రబలిన వాడే । శ్రుతి ప్రమాణములకంది యుండదనివాడే । అణిమాద్యష్ట సిద్ధుల । కరయు శక్యముగాక । గుణవిగ్రహాతీత । గుప్తజ్ఞాన కోదండ ॥రా॥

3 రాజయోగారూఢ ము । ద్రలను గనివాడే । సర్వరారాజ పూజితుడై । ప్రబలినవాడే । అజహరి రుద్రాదుల ।

కతీతమైనతత్త్వ । విజయుడై సామ్రాజ్యవిభవము గల
పట్టాభి ॥ రా॥

4 అద్వితీయానందమై - యూరిన వాఁడే । భక్తహృద్వీథిసీమ
లందు ॥ నెలసిన వాఁడే । సద్విజులను దెల్పి ॥ సమరసైక్య
జ్ఞానాబ్ధి । చిద్విలాసానుభవము । జేరజూపిన పట్టాభి ॥రా

5 పూర్ణానంద పురిని ప్రోచినవాఁడే । భవ తీర్ణుఁడౌ సుబ్ర
హ్మణ్యుని జేరిగో త్రుఁడే । పూర్ణాచలాఖండ పరిపూర్ణ
తత్త్వ బోధను-పూర్ణవహనమున ధన్యులౌ శ్రీఅనంత॥రా

## 49. కళ్యాణిరాగం - అటతాళం

(రాను పో మాయున్నలార - అనుమాదిరి)

రానుపో పరమాత్మునికి సేరాను పోనిక ॥రా॥
జ్ఞాన విజ్ఞాన భూ । మానందాత్ముఁడనుగాన ॥రా॥

1 అందనగా మదాత్మరూప మొందియున్న గో । విందుని
స్వరూపమైనా । కేంద్రుఁజూచిన సుందరీగాన ॥రా॥

2 పంచదశి భావమునఁ బ్రపంచమును నదే । ఎంచరాని పర
మాత్ముని । గాంచఁగలిగె గానసే ॥రా॥

3 స్వస్వరూప మరయు సర్వ । సాక్షినైతిగా । దుస్స్వభావ జన్మ
కర్మ । దురిత దుఃఖము వదలెగనుక ॥రా॥

4 ధరను పూర్ణానంద పుర । ధాముడైన శ్రీ । పరమాత్మ
యారామగురుని । భక్తుఁడ సుబ్రహ్మణ్యుఁడఁగాన ॥రా॥

## 50. బేహాగ్ రాగం – ఆదితాళం

అపహరించినాడే । ఆభరణము ॥అప॥
అవాఙ్మానస గోచరు ॥అప॥

కృపఁజూచియు వాస్తవముఁదెల్పు మన
సుపదేశముఁ బొందుమనుచు సర్వము ॥అ॥

1 ఐహికాముష్మిక సుఖంబుకన్న ని । జాత్మసుఖము శాశ్వ
తంబటంచును । మహానేకాదశి ద్వాదశివ్రతముల మాయ
మహిమ కామ్యకర్మాదుల ॥అప॥

2 అర్థినై పరమమోక్షాపేక్షను । పార్థసారథిని గన నేగు
చుండ । సార్థకమని సచ్చిదాత్మ దెలిపియు । తీర్థయాత్ర
తిరునాళ్ళనెల్లఁదా ॥అప॥

3 విమలానంద విశేషజ్ఞానమున । వివిధ యోగవాంఛలు
పోలేదన । శమమిదియె స్వస్వరూపమగునని । యమ
నియమాద్యష్టాంగ యోగముల ॥అప॥

4 దేహిదేహముల మోహము వదలుటకు । సోహమాత్మ
భావంబుననుండుగ । నూహలేని తావునుగనుమని తా
సోహం బ్రహ్మంబను భావార్థము ॥అప॥

5 అహమేవ పరబ్రహ్మమనుచునే । నాత్మఁదలచి యానం
దముఁజెందగ । ఆహాహా ! చూడు చూడుము నీ వద్వై
తాత్మ తత్త్వమైతివి యను నహము ॥అప॥

6 ఎవరు నెచటనుండి యెందుకు వచ్చెనో । యేమి జూచి
చెప్పి యేమి చేసెనో । భవముఁబోయె బ్రహ్మమాయె
సర్వశ । భం సుఖంబనుచు భయమును ॥అ॥

7 ధరను పూర్ణాత్మ తత్త్వ పురంబున । దైవమనుచు రామ
గురుని గొల్చెడి ! సరస సుబ్రహ్మణ్యుని స్వానుభవము
సత్యమనుచు సకలాత్మ బోధముల ॥నవ॥

### 51. సువ్వరాగము - చతురశ్రగతి.

ఇంకేమున్నదిరా । అదిగో । కింకేమున్నదిరా
సకలోనారాయణ తత్త్వముగా ॥కిం కే॥
లోకాలోకములు లలిత సర్వమును
ఏకమేవాద్వితీయ బ్రహ్మముగా ॥కిం కే॥

1 సంచితాది త్రిపురిరహిత పరమున
నెంచి తలచి చెప్పి జేసి చూపుట ॥కిం కే॥

2 కర్త భోక్తలను నదితానంటచే
కర్తృత్వము భోక్తృత్వము బోయిన ॥నిం కే॥

3 జ్ఞాతృజ్ఞాన జ్ఞేయతలు మఱచియు
ధ్యాతృధ్యాన ధ్యేయంబు లదిగాక ॥ఇం కే॥

4 అండపిండ బ్రహ్మాండములను న
ఖండ సాక్షాత్స్వ రూపముగా గన ॥నిం కే॥

5 లోకానుగ్రహమున సత్కర్మల । నేక
ముఁ జేయు నిస్సంగాత్మునకును ॥ఇం కే॥

2 పరిపూర్ణానంద పురనివాసం! భక్త సుబ్రహ్మణ్యాత్మ సుభాసం ।పరమాకాశా తీతసుహాసం । ప్రతాప రామానంద విలాసం ॥అ॥

—* సింహాసనమ్ *—

శ్లో॥ రత్నసింహాసనం వందే! సంగృహాణ మయార్పితం।చంద్ర మండల నంకాశం । సంస్మితా సన పంకజ॥

3 ఝుంఝూటిరాగం - ఆటతాళం

సింహాసనం బలంకరింపు । శ్రీగురువర్య । సంహార మొన ర్పితివి భ్రాంతిని । సద్గుణధుర్యా ॥సిం॥

1 సర్వమై యున్నది తానసెడి । స్వానుభవమున । నిర్వికార స్థితిచే నున్న । సర్వాధారమైన గా ॥సిం॥

2 నవవిధ భక్తినామక । నవరత్న ఖచితసూ । సువి లాస భాసిత । సూరిహృదయ పీఠమును ॥సిం॥

3 రాజరాజ పూజితుండౌ । రామగురు మహా । రాజుడేర సుబ్రహ్మణ్యుడు । రాగరహితుండై రియోసంగు ॥సిం॥

—పాద్యం—

శ్లో॥ పాద్యం గృహాణ భోస్వామిన్ । మయానీతం సుభప్రదం॥ కృష్ణవేణీ జలం భక్త్యా ! తీర్థపాద! జగద్గురో॥

4. కీర్తన

పరాకాశాశాంతమా । పరాత్మ గురువరు
పరానందమనెడి తీర్థ । పాద్య మొసంగెద ॥ప

1 నిత్యశుద్ధ బుద్ధముక్త । నిర్వికారమౌ । సత్యబోధ శ్రవణ
మనెడి। సకలనదీ జలములచే ॥ప॥

2 ఉన్నది తాఁగనిసను । తానున్నదాయెగా । అన్నమయ
కోశంబనుసది । అదేమాయెననెడి పూర్ణ ॥ప॥

3 బ్రహ్మవిద్వర వరితాప । రామగురు కృపచే । బ్రహ్మ
తత్త్వమై మను సు । బ్రాహ్మణ్యం దాసఁగుదివ్య ॥ప॥

—* అర్ఘ్యం *—

శ్లో॥ అర్ఘ్యం దాస్యామ్యహం భక్త్యా । తవ పాణితలే విభో
గోదావరీజలం హేమ । కలశస్థం । సువాసితం॥

5 రాగము – కేదారగౌళ – తాళము అట

అశరీరునౌ । గురున కాత్మానందమును
నర్ఘ్య మర్పణఁ జేసెద ॥అ॥
విశదముగ । విదేహముక్త వివేకశుద్ధాద్వైత స్వరూప । కాశ
మౌ పూర్ణాత్మబోధను ఘనముగాఁ దెలిపిన చి
దాత్మం ॥అశ॥

1 ఘనముగ తను దాఁగన్నను । తానె సర్వంబై । నను వున
నీనూత్మ ॥ తనుననునదాయె । కనవినను । తిన నేమి
లేకను । కార్య కారణ రహితమై యే । మనఁగరాక
విశుద్ధ ప్రజ్ఞా । నాత్మరహితంబై వెలంగెడు ॥అ॥
2 ధరను పూర్ణానంద పురవర । నిలయుతో । పరమాత్మ
రామగురు చరణ కమలముల । నిరతమును మదియందు

నిల్పియు - నిత్యముగ సేవించుచుండిన - సరస సుబ్ర
హ్మణ్యభక్తుని సంపూర్ణ స్వానుభవరీత్యా ॥అ॥

—* ఆ చ మ న మ్ *—

శ్లో॥ ఆచమ్యతాం -మయాదత్తం -
హేగురో - యమునాజలం - త్వదర్థం -
కృపయా - భావ-భవబాధ నికృంతిన॥

6 బేహాగ్ రాగము - ఆదితాళము

(సొంపుఁ బెంపుఁ దెంపుఁ గను రాసూ అనురీతి)

ఆచమనమిదో! రామచంద్ర - ఆచ
మించు - పూర్ణ తత్వ దేశికేంద్ర అ॥

వాచామ గోచర పర - బ్రహ్మరూపమైన సర్వ - సూచ
నార్థములు గల - శుద్ధాద్వైతానంద మను అ॥

1 కానిదేమొ చూడ లేనిదాయె - నిక కార్యకారణము
లేమనగరానిదాయె - పూని కారణాత్మ యమున దే నిరా
కార మాయె - గానఁ జెప్పరాక - చెప్పనట్టిదా
యమునా తీర్థ ॥ఆచ॥

2 భువిని పూర్ణానంద పురమందు । పూర్ణత త్వ పరానంద
సహజాను భవనుందు కేవలాత్మయై యున్న దైవ సుబ్ర.
హ్మణ్యుఁడింపు । భావరహితమై యొసంగు - బ్రహ్మానంద
మను తీర్థ ॥ఆచ॥

— * పంచామృత స్నానమ్ * —

శ్లో॥ శర్కరాదధి మధ్వాజ్య - క్షీరమిశ్ర మిదం విభో - పంచామృతం-మయా- దత్తం - స్నానం- కురు జగత్పతే॥

7 హిందూస్థాని - ఖుభారి రాగం - ఆదితాళం

పంచామృత స్నానము - పరమాత్మ గురునకిదె ॥పం॥
సంచితాగమ ప్రారబ్ధంబుల- దుంచి వైచు నిత్యానందం బను ॥పం॥

1 గోక్షీరము - దధ్యాజ్యము - శర్కర - మాక్షికమధుపు ఫలోదకములుగల ॥పం॥

2 పంచ సిద్ధాత్మలనెడి తత్త్వము సత్యజించు బంధ వ్యామాంతములనునిజ ॥పం॥

3 పూర్ణాద్వైతాత్మ రామగురు పద - పుల్లాబ్జమాలకు సుబ్రహ్మణ్యుడొసంగిన ॥పం॥

— * శుద్ధోదక స్నానమ్ * —

శ్లో॥ తప్తకాంచన కుంభస్థం - కించిదుష్ణం - సువాసితం మయానీతం - జహ్నుకన్యాజలం- స్నానం - కురు ప్రభో॥

8. నాదనామక్రియ రాగం - జంపెతాళం

(సకలేంద్రియములారా - అనుమానగిరి)

స్వచ్ఛమగు నానంద - మను తీర్థములగురుని - చరణము లకభిషేకము - సచ్ఛిష్యులును జేరి - సద్భక్తితోఁ జేయ శాశ్వతంబగుముక్తి - సత్యముగఁ బొందనగు ॥స్వ॥

1 అత్యంత నిర్మలంబగు శాంతియను తీర్థమాచార్యునకు
స్నానము - వృత్త్యంతరహితమా - వేదాంతవాక్యముల
వేడుకతో బత్తి - యింపుచు - జేయింపనగు ॥స్వ॥

2 జ్ఞాన విజ్ఞాన సంపూర్ణులౌ శ్రీరామ - స్వామిసద్గురు
రూపము - తన నిజాత్మానుభవము నను-సుబ్రహ్మణ్యుం
డనఘుండై గనియు - సద్భక్తితో సేవింప ॥స్వ॥

—* వస్త్రమ్ *—

శ్లో॥ వస్త్రయుగ్మం - మయాదత్తం - త్వదర్థం స్వర్ణతంతునా
నిర్మితం - నిర్మలం - స్వామిన్ - నిత్యకళ్యాణపావన॥

9 బేహాగ్ రాగం - ఆదితాళం

వస్త్రమిదిగో గొనుమా - పరతత్త్వానంత ॥వ॥
నూతన పీతాంబరపు జరీ కొల్కుల ॥వ॥

అ॥ శాస్త్రాది సర్వవాసన రహిత అద్వైత
శాస్త్రానుభవమైన స్వర్ణమయమా ననంత ॥వ॥

1 అద్వితీయానందమై - కార్పాసము - వంత నొకటిగం
జేర్చియు - సద్వినయంబున - చక్కని నూల్వడకి
హృద్వికాసముతోడ - నేసి నేడర్పింతు ॥వ॥

2 పూర్ణానంద పురిని- మును వెలసిన । పూర్ణరామగురుని
పూర్ణభక్తిని సేవించిసుబ్రహ్మణ్యుండు- భూమానందరూప
మైరాముసంగెడిదివ్య ॥వ

——* యజ్ఞోపవీతం *——

శ్లో॥ కార్పాస తంతునా శుభ్రం-రచితం - తేర్పితం మయా
సంగృహాణ ! గురో!యజ్ఞసూత్రం - పాత్రం.దయానిధే.

10 శహానరాగం – రూపక తాళం

దీనబంధుఁడవని నే – దేశికేంద్ర – శరణంటిని ॥దీ॥
జ్ఞానానంద స్వరూప – జ్ఞానయజ్ఞోపవీతముగొను ॥దీ॥

1 భక్తి జ్ఞాన వైరాగ్య వి – ముక్తి తత్త్వముగ । దెలిపెడి
యుక్తితోడ! సప్తవింశతి । యోగభూమికలు గలిగిన ॥దీ॥

2 నిగమాంతా నీదురూపు । నిజ యజ్ఞోపవీతంబగు । జగ
మెఱిగిన బ్రాహ్మణునకు । బందెమివ్వ నెటులౌనో ॥దీ॥

3 పరిపూర్ణానంద పురమె । పరమ గురుస్థానంబుగమున్
అరయుచు సేవించు సుబ్రహ్మణ్య నిజాత్ముఁడగురామ॥దీ

—* శ్రీగంధమ్ *—

శ్లో॥ మలయాచల సంభూతం । కర్పూర కలితం । విభో
విలేపనం । త్వదర్థంభో । గృహ్యతా మర్పితం । మయా॥

11 బెంగాల్ తోడిరాగం – రూపక తాళం,

శ్రీ చందన మలదరారె – శ్రీరమణులు గురునకు ॥శ్రీ॥
శ్రీరాము గురునకు ॥శ్రీ॥
సూచించున దేమో గని । శుద్ధాత్మను । దెలియరే ॥శ్రీ॥

1 అశరీరుం డనెడి వాక్య । విశద మదే గనరె
సశరీరులు గాక సర్వ శరీరులైయున్నది తెలియరె ॥శ్రీ॥

2 దేహ భావనాది। సర్వ । త్రిపుటి రహితమై సదా ।
అహం రహిత నిష్ఠనున్నయద్వితీయ నిర్లేపునకు ॥శ్రీ॥

3 అంబరాంతవాసు । సుబ్ర । హ్మణ్య పోషకునకు - అంబ
రత్రరగరు జవ్వా । ద్యఖిల కుసుమరస మిళితమా ॥శ్రీ॥

— ఆ భ ర ణ మ్ —

శ్లో॥ కిరీటం - కుండలం - రత్న - కంకణాదీని । తే । మయా
సంగృహ్యతాం- భూషణాని । చార్పితాని - నిరంజన॥

శ్లో॥ తండులాన్-ధవళాకారాన్ - హరిద్రాచూర్ణ మిశ్రితాన్
గృహ్యతామక్షతాన్ దేవ-మయా-దత్తాన్-మనోహరాన్॥

12 శంకరాభరణరాగం - ఆటతాళం

ధరియింపరమ్మా - భూషణములు ॥ధరి॥
ధరియింపరమ్మ సుం - దరులార గురునకు - సురుచిర నవ
రత్న - సువర్ణా భరణములు ॥ధరి॥

1 సర్వాతీతనిత్య - సర్వాలంకారమా
సర్వపూర్ణాత్మకు - సర్వాలంకారములు ॥ధరి॥

2 కనకకిరీటము - ఘనకుండలంబులు
అనువున చంద్ర సూ-ర్య హారాదులు గళమున ॥ధరి॥

3 మొలక వెన్నెలఃగల-తులసీ బిల్వదళ
ములు సువాసనగల - ముఖ్యపుష్పమాలలు ॥ధరి॥

4 ముక్తాదిమణులచే - మొనయుః గంకణములు
ముక్తిసూచన దెలుపు - ముంజేతులకు నిపుడు ॥ధరి॥

5 అక్షరాతీత ప్ర - త్యక్షు వరమాత్మకు
సాక్షాత్స్వరూపమును - సక్షతలనుమీరు ॥ధరి॥

6 నిరతము భక్త సుబ్రహ్మణ్యుం గృపంజూచు
పరమాత్మ శ్రీరామ - గురుచరణములకు ॥ధరి॥

— పుష్పమ్ —

శ్లో॥ పుష్పాణ్యనేకాని - సుపల్లవాని - సుగంధయుక్తాని
మనోహరాణి-త్వాం గృహ్యతాం - దేవ మయార్పితాని
జలాశయస్థాని - జపాదికాని॥

18 హుసేనిస్థాని - కాంభోజరాగం - ఆటతాళం

(గురుని చరణస్మరణ జేతను - అనుభూదిరి)

శ్రీగురు చరణ పూజసేతము - ఓ భక్తులార
స్థిరపదంబుం జేరియుందము ॥శ్రీ॥
ఆగమాంత స్వప్రకాశ-మద్వయానంద తత్త్వ-యోగము
సహజామనస్క - భోగానుభవమని చెప్పు ॥శ్రీ॥

1 నాదబిందుకళాతీత - న్యాయమహా ప్రమాణవాక్య - బోధం
దెలియంజేసి భక్త - హృదయాకాశమున నున్న ॥శ్రీ॥

2 వృశి యోత్పత్తులు లేని - పరిపూర్ణాద్వైత బ్రహ్మ - తెలిసి
బ్రహ్మానందంబను - దివ్యరూప పుష్పముల ॥శ్రీ॥

3 మల్లె సన్నజాజి చా। మంతి గులాబీ గన్నేరు। మొల్ల
లును సువర్ణ పుష్ప। ములు తులసీ బిల్వములచే ॥శ్రీ॥

4 ఈ మహీ వల్లూరి ప్రకాశ। రామగురు పదాబ్జములను
వేమరు సుబ్రహ్మణ్యుండు॥ విమలుడై పూజించు వేళ॥శ్రీ॥

## —* ధూపమ్ *—

శ్లో॥ చందనాగరు కర్పూర । శర్కరాజ్య సమన్వితం ।
ధూపోయం గృహ్యతాం స్వామిన్ ।త్వమిదం
తే మయార్పితమ్॥

14 బిలహరిరాగం నవరోజురాగం - రూపకతాళం.

(గానలోల - అనుమాదిరి)

ధూప మా॥ధూపయామి-హేపరాత్పరా
శ్రీపదారవిందములను - జేరితిరా ధీరా ॥ధూ॥

మి॥ ఆ పద్మాబంధవ సర్వాధార! అఖిలలోక కళ్యాణాకార
పాపతిమిరతీక్ష్ణ భాస్కర । భక్త హృగయ సద్విహార ॥ధూ

1 వృత్తుల మధ్యమ కాలమె విమలంబై యుండెరా । మత్తు
వీడి గాంచినవడె । మహా జ్ఞానాగ్నిరా॥అత్తిపువ్వులక
బోలు నట్టి యీ । యఖిల ప్రపంచేంద్రిజాల మను నగ
రొత్తుల వెల్గించినడా । యున్మనస్యంత సువాసన॥ధూప॥

2 జయ మొందియు - నది-యాటను । స్వప్రకాశాగ్నిరా
జ్ఞేయాది త్రిపుటిరహిత సిద్ధియను గోఘృతమురా॥

3 అయమాత్మాతీతా-రో! అస్మద్గురువరరామా-నయ
మున సుబ్రహ్మణ్యుని- ననుబ్రోవగ సమయమిదే ॥ధూ॥

## — దీపమ్ —

శ్లో॥ వహ్నినా- యోజితం-సాజ్యం।దీపం - వర్తిత్రయాన్వితం
గృహాణాజ్ఞానతిమిర హార - జ్ఞాన ప్రవర్ధనమ్.

15 కాఫీరాగం - ఆదితాళం

(నీలవర్ణా-బాలకృష్ణా - అనుమాదిరి)

దివ్యబోధ స్వప్రకాశ దీపదర్శనంబుఁ గొనుమా॥
భవ్యాద్వైతాత్మ చరితా-పరమపురుషా-భక్తపోషా ॥ది॥

1 స్వానుభవాతీత సర్వ- సహజ సమరస్యైక్యజ్ఞాన- సదనుప
మానస చిత్కళలనే - ఆత్మ హారతుల సర్పింతు ॥ది॥

2 సకలచరాచరములను - సాక్షివై వెలుంగుచున్న- ప్రక
టితోంకారాతీతమైన - ప్రజ్వలించుచున్న ఘృత ॥ది॥

3 ధరను పూర్ణనగరపుర - భాసుతో శ్రీరామగురు - స్థిర
పదంబౌ సుబ్రహ్మణ్యా - చిన్మయాత్మాతీతమను ॥ది॥

— నైవేద్యం —

శ్లో॥ శాల్యన్నం - షడ్రసోపేతం - పంచభక్ష్యాది సంయుతం
నైవేద్యం- దేవదధ్యాజ్య-సంమిశ్రం ప్రతిగృహ్యతామ్॥

16 శహాన రాగం - రూపక తాళం.

అరగించవయ్యా! శ్రీగురో । అమృతరసఫలము ॥లా॥
ఆరగించ నయ్య శాశ్వతానంద సంతృప్తియను । కోర
దగిన పూర్ణబోధ । గురుతున సహజానుభవము ॥నా॥
మేలగు నబీజవృక్షముల్ ॥ మిన్నునను శాఖాపల్లవ పత్ర
పుష్పరహితమై । కాలా కాలములనక గాయు । కనుల
పండువై । సర్వము । మేలైయున్నది గన తా । మేతే
మను పూర్ణ ఫలము ॥లార॥

2 అవపేక్షితమై సకలమున । తనకయ్యు: దాను మును సహజంబుగ ప్రౌఢంబౌ । ఘనమగు సకల పదార్థము లను ద్వంద్వాతీతంబుగ । గొని తెచ్చిన సుస్వర సములన్న మపశ నైవేద్యము ॥౮ర॥

3 శ్రీపూర్ణానంద పురమున - రావర్ల వేణు - గోపాల స్వామిని వేడిన - శ్రీపతియై - శ్రీరామ గురు స్వ - రూపమై సాక్షాత్కరించి - ఆ పరమర్మ తెలుప సుబ - హ్మణ్యుడౌనగు స్వార్జితమును ॥అర॥

—— తాంబూలమ్ ——

శ్లో॥ తాంబూలం - గృహ్యతాం - పూగీ ఫల
కర్పూర సంయుతం - నాగవల్లీదళాద్యంతం
గురో! తుభ్యం మయార్పితమ్॥

17 ఆనందభైరవి రాగం - అటతాళం.

(చందన మిచ్చెద - గొనుమా - అనురీతి)

తాంబూల వీడెముగొనుమా! శ్రీగురు దేవా! ॥తాం॥
తత్త్వాతీత - దర్శనాను భవముదెల్పుమా! ॥తాం॥
అంబరాంతంబైన శ్రీవర-మాత్మరూపుండ వని తెలిసియు
సంబరమున నొనగు దివ్య - జ్ఞానవాసన పచ్చకర్పూర॥

1 సర్వానందాతీతమైన - సర్వవస్తు సాకార - జ్ఞాన సముదయమున నిర్వికారమై తానున్న - నిఖిలవాసన సంకల్పములు తీరిపోయిన- సర్వమున సర్వోన్ముక్తి - ప్రశాంతి

యుత సహజామనస్కమును - జెందియుం బూర్ణమైతా
ననుటలేదను పండుటాకుల ॥తాం॥

2 రాజయోగమునం బరిపూర్ణ తత్త్వ - రామ గురు
స్వ స్వరూపముగన - రాజసాదిగుణ రహితమై - భ్రాజిత
మనము స్వభావము విడిన - నిజగజ్జేశ్వరులనగ - నెపుడు
లేవను సుబ్రహ్మణ్యుండ - జాజికాయ లవంగ పోకలు
జాపత్రి యాలకుల యుతమా ॥తాం॥

—* నీ రా జ న మ్ *—

శ్లో॥ నీరాజనం మయాదత్తం రాజరాజేశ పూజితం । గృహాణ
జగదుత్పత్తి హేతుభూతాఘనాశన ॥

18 బిలహరి రాగం - అటతాళం

కర్పూర నీరాజన మివకే నేర్పునను శ్రీసద్గురు వర్యునకు॥క
ఓర్పునను సాక్షాత్పరబ్ర । హ్మార్పణంబుగ । సర్వాకళల
న - మర్పించి సర్వంబు ద్యానై - దర్పరహిత సుతత్త్వ
మానిజ ॥క॥

పంచ కోశాంతర వాసునకు - పంచవింశతి తత్త్వరహి
తునకు । పంచభూతేంద్రియ దూరునకు । పంచ విషయ
రహితునకు - పంచదశి భావంబుచెప్పి ప్ర - పంచభావము
ద్రుంచివైచియు । పంచవిధ వ్యోమాంత నిర్ప్రప్ప పంచ
రూపంబైన - విభునకు ॥క॥

౩ సృష్టిస్థితి సంహార వేద్యునకు - వ్యష్టిసమష్టి రహితునకు
అష్టావరణ ప్రకృతి దూరునకు - ద్రష్ట్రు దర్శన దృశ్యాం

తునకు - అష్టదళ పద్మాంతమందున- నిష్టదైవంబై వెలసి
సు-ద్రష్టయై నిజభక్తులకు స-ద్గోష్ఠి దెల్పినసా్వ సద్గురు ॥క॥

3 పూర్ణ బ్రహ్మానందాత్మునకు- పూర్ణాత్మాపూర్ణాంతర పూర్ణు
నకు - పూర్ణానందపుర వాసునకు - పూర్ణ సుబ్రహ్మణ్య
పోషునకు - పూర్ణతత్త్వ స్వరూపంబై- పూర్ణాద్వైతబోధి
తాత్మ - పూర్ణ పదవి నలంకరించిన పూర్ణుడౌ శ్రీరా
మగురునకు ॥కర్పూ॥

— మంత్ర పుష్పమ్ —

శ్లో॥ సుకేతకీ, పాటలపారిజాత - చాంపేయ కంజాత రసాల
మల్లికా-చామంతికా సంయుత మంత్ర పుష్పం- గృహాణ
విష్ణో! శివశంకరాచ్యుత॥

19 హిందూస్తాని ముఖారి - జుల్వతాళం
(ఎవరిగతి యెటులునున్నదో)

సువర్ణ మంత్ర పుష్పముఁ గొనుమా! సుధీవరా ॥సు॥
భవవిదూర భక్తవరద పరమాత్మా! శ్రీగురో ॥సు॥

1 నిరతము దినమునను జరుగు-నిరుపదొాక్క- వెయ్యాఱ్నూర్
పరమహంసలును సుసం- ప్రవృత్తులను సువాసనగల ॥సు॥

2 మరుమరీచికా స్వరూప - మౌ మోహాంధ భవమువీడి
పరతత్త్వైక్యమునను-"బ్రహ్మైవాహమస్మి"యను ॥సు॥

3 త్రిపుటి రహితమై నర్వా - తీతమైన వాక్యస్తోత్రము ల
వరిమితాద్వైతానం - దానుభవసంపాత్న ॥సు॥

4 వసుధ పూర్ణానంద పుర ని - వాసుడౌ శ్రీరామగురున
కనిపదాంతమా సుబ్ర - హ్మణ్యుఁ డొనంగు దివ్య ॥సు॥

—* ప్రదక్షిణ నమస్కారమ్ *—

శ్లో॥ జన్మాంతర కృతాన్యాని - యాని పాపాని
మేప్రభో నశ్యంతు తే తాని తాని ప్రదక్షిణ పదే పదే.

20 హిందూస్తాని కాఫిరాగం - ఆదితాళం.

( ప్రదక్షిణము జేతు - అనుమూందిరి)

ప్రదక్షిణముఁ జేతుఁ బ్రకృతి ద్వయరహిత - పరమాత్మ
శ్రీ సద్గురో! హే గురో! బ్రహ్మేన్ద్ర శివగురో! ప్ర॥

1 హాయి బొదుటాయె - ఆనందమునాయె - హాయి యతీత
మాయె - హేగురో! హాయి మటుమాయమాయె ॥ప్ర॥

2 త్రిపుటి రహితమున - త్రివిధదీక్షలనొంది
త్రివిధనమస్కారముల్ జేతుఁ ద్రిమూర్త్యతీతాగురో॥ప్ర

3 ద్వాదశాంతమున తత్త్వాతీతముగని
ద్వాదశనమస్కారముల జేతుఁ దహరాకాశాంతాగురూ॥

4 సర్వ స్వరూపమా - స్వ స్వరూపముగని
సర్వ నమస్కారముల్ జేతుఁ - సర్వానంత సద్గురో॥ప్ర॥

5 నారాయణుండే మా - శ్రీరామగురుడై భువి - జేరి
యవతరించెను. సుబ్రహ్మణ్య! శ్రీఘ్రమునను బ్రోవను ॥ప్ర॥

## 21 అవధరింపు కీర్తన - పరాకులు - వాక్యములు.

దర్బారురాగం - అటతాళం.

అవధరింపుమా! గురో! అవధరింపుమా!
అవధరింపు శ్రీమద్గురో! ఆదిగాది విద్యాగురో ॥అ॥

1 సాధన చతుష్టయము గల్గు! సాధులిచట జేయుసేవ ॥అవ॥

విజ్ఞాపన వాక్యము:— శ్రీమదఖండ సచ్చిదానందానంత నిత్య నిర్వికారాసంగాప్రమేయ పరిపూర్ణ పరాకాశాతీత పరస్వరూపః॥
॥పరాక్ - బహుపరాక్॥

వాక్యం:—అద్వితీయ మఖిలోపాధి వినిర్ముక్త - తత్సకల శక్త్యుప బృంహిత మనాద్యంత ప్రశాంత నిర్గుణ శివ మిత్యాది వాచ్య మనిర్వాచ్య చైతన్య స్వరూపం
॥పరాక్-బహుపరాక్॥

2 చరణం:—సహజ సమర సైక్యజ్ఞాన - సరసనృత్య- వాద్య గీతము ॥అవ॥

వాక్యం:—ప్రణవాబ్ధి మహోత్పన్న జ్ఞానపీయూష పరిపూర్ణ పరానంద ప్రజ్ఞాన ఘనలక్షణాది సర్వాలక్షణ లక్షితం
॥పరాక్-బహుపరాక్॥

భావాభావ కళాతీత సర్వ గ్రామమహేశ్వర బ్రహ్మ విద్యా మయుగ్రామ చిదాలయ మహాప్రభా ప్రత్యగ్భూత మహా మౌన గోచర సురక్షితం॥ పరాక్ - బహు పరాక్.

3 చరణం:—వేద వేదాంత వాక్య॥విజ్ఞానానంద॥శ్రవణ ॥మవ॥

వాక్యం:—అత్యంత నిర్మలాకాశ చైతన్య పూర్ణాద్వైత పరమానంద చిద్విలాస॥ పరాక్ - బహుపరాక్.
అనేకకోటి బ్రహ్మాండ సర్వాత్మక సర్వాది మధ్యాంత రహిత బ్రహ్మానంద సదాధార మార్గ సీమాంత వాసం॥ పరాక్ - బహుపరాక్

4 చరణం: నామరసములు సేచుచున్న । సద్భక్తుల వాక్యామృతము ॥లవ॥

వాక్యం:—నిస్త్రైగుణ్యమహామార్గ జ్ఞానైక గోచర చిదానంద నిర్మలాఖండ నిరాధార మహాదేశస్థిత చిన్మండలాకారం ॥పరాక్ - బహుపరాక్.
అప్రమేయ పరానంద ప్రత్యగ్రూప సదా విముక్త మహాస్థిత స్థిత చిద్రూప విగ్రహాకారం ॥పరాక్ - బహుపరాక్.

॥అమితానంద బోధాంత నాదాంతస్థిత । బహ్మాఖండ శుద్ధ చైతన్య పంజరస్థమహాహంస మార్గమాంత్రైక విద్యాకారం ॥పరాక్-బహుపరాక్॥

5 సర్వాతీత పూర్ణతత్త్వ - సహజానందానుభవము ॥అ॥

వాక్యం:—నిత్యపూర్ణ చిదాకాశస్థిత నిర్వాణసుఖ స్వభావక॥ ॥పరాక్ - బహుపరాక్॥

నిర్వికల్ప నిరాభాస శుద్ధచైతన్య మద్విష్ఠైక్యాను

సంధాన పరవ్యోమాంత సంస్థితానందదేవం
॥పరాక్-బహుపరాక్॥

6 చరణం:-దశాశాంతరూప-దశవిధ మంగళవాద్యము॥లవ
వాక్యం:—నిర్వాణశైల నిలయ మహాచిన్మంటపస్థిత మనేక
కోటిసూర్యప్రతీకాశం ॥పరాక్-బహుపరాక్॥
పరాత్పర మహావ్యోమ భాసమాన దివ్య నాదాంత
స్వప్రకాశం ॥పరాక్ బహుపరాక్॥

7 చరణం:-శ్రీగురు ప్రతాపరామ-చిదంబుధి విజ్ఞానసోమ॥అప
వాక్యం:—శ్రీమదఖండానంద ప్రతాపవంశ - పయఃపారా
వార జ్ఞానరాకాసుధాంశు మండలస్థిత శ్రీరామాభి
ధానసద్గురు సర్వస్వరూపం ॥పరాక్-బహుపరాక్॥
"ఏతత్సచ్చిదానంద స్వప్రకాశగురుచరణ కమల నిజ
భక్తములుకట్ల సుబ్రహ్మణ్య భక్తాంతరంగ భక్తి విర
చిత శ్రీ సద్గురు షోడశోపచార పూజాదికృత్యే -
తత్ప్రభృతి సముదయసుపుష్పమాలికా స్వస్వరూపాను
భవపారీణ సరాయణ స్వరూపం ॥పరాక్-బహుపరాక్॥

8 చరణం:—పూర్ణానంద పురనివాస । పూర్ణ
సుబ్రహ్మణ్య పోష ॥అప॥

—* మంగళహారతి *—

మంగళం । శ్రీరామదత్త । మహాదేవ బ్రహ్మగురో
మంగళం శ్రీపరాశక్తి మాత శ్రీపరో॥

1 సత్యజ్ఞానానందరూప । నిత్యనిర్వికారదీప। ప్రత్యగ భిన్నాత్మరూప భవ్యమంగళం ॥మ॥

2 అంతర్బహిత్య సర్వ ఆత్మతీత స్వప్రకాశ - సంతత మాఖండరూప సర్వమంగళం ॥మ॥

3 సగుణ నిర్గుణాతీత సర్వసాక్షి స్వప్రకాశ । నిగమ వినుత సద్వికార నిత్యమంగళం ॥మ॥
భువినిపూర్ణానందపురిని పూర్ణరామ దేశికేంద్ర దైవ సుబ్రహ్మణ్యవినుత - తత్వమంగళం మంగళం శ్రీరామదత్త॥

22 —* మంగళ హారతి *—

సురటరాగం - ఆదితాళం-

(విజయ గోపాల తే మంగళం అనురీతి)

శ్రీగురు చరణ ! తే మంగళం - జయ .. చిన్మయరూపతే మంగళం ॥శ్రీ॥

1 యోగానంద సుయోగ పరాత్పర । యోగికులోత్తమ శ్రీకరా॥
రాగద్వేష విహార సుధీవర । యోగాతీత తేమంగళం॥శ్రీ॥

2 కమల సంభవాద్యఖిల సురార్చిత । కామితమోక్ష ఫలప్రద । విమలానంద స్వరూప ప్రబోధా।వేదాంతాత్మ తే మంగళం ॥శ్రీ॥

3 పూర్ణానంద వరపురధామా । బుధవరగురు శ్రీరామా । పూర్ణ సుబ్రహ్మణ్యార్చిత విరామా ।
భూమానంద తే మంగళం ॥శ్రీ॥

కం॥ ధరగల గురుభక్తులు మది
మురియుచు సద్గురుని శక్తి । పూర్వక భక్తిన్
మరిగొలువఁ బొందుదురుగా
చిరతర బ్రహ్మైక్య పూర్ణ । చిత్సుఖపదవిన్.

—* శ్రీ గురుదత్త లఘుపూజా విధానము *—

సీ॥ ధ్యానంబుఁ జేతు ద్వా । దశ మంత తత్త్వార్థ
భావంబుఁ దెలిసి యా । వాహసంబు
జేతు సింహాసనం । బాసతోడ నొసంగి
సాధనసంపత్తి । సరణినొంది
శ్రవణాది త్రయమును । వివరముగాఁ గాంచి
యనువుగాఁ బాద్యార్ఘ్య । మాచమనము
లనునొసఁగెద మ్రుద । లనుజూచి చిత్కళల్
బొంది పంచామృత । ముల నొసంగ

తే॥ గీ॥ దాత్మసిద్ధికి శుద్ధజ । లాభిషేక
మును నొనర్చెదు । భ్రాంతియుఁ బోనడంచి
వస్త్రయుగ్మంబు నర్పించి । భావరహిత
చేతనంబయ్యు యజ్ఞోప వీతమిడుదు.

ఓమ్ తత్ సత్.

అద్వైత పూర్ణానుభవ ప్రకాశిక సమాప్తము.

—೦—

## శంకరాభరణ-రాగం

కారాణమునుగాంచుడి కార్యముకేని । కారణమును। గాంచుడి । కారాణమును గాంచ కర్మత్రయముదీరి సాకేసా కెకువచ్చి । జచ్చిసంధియుదీరి భారతీశచ్యుత భావాదులు కోరిపూర్ణాద్వైత గురుదరిజేరి । కారణరహితమూ । నీవార శూకా।గంబుదాటిరి ॥కా॥

1 నేను నీవని బలికినా । దానికి మూలం లేని దానిని గనిన నేనని । నీవనిన। లేదికమూందుగ। నేను నీవనకను। నిండిన దొకట్టైతే । గాన నీవన నేనంగను మానుగను భావం జేయుగునని । తానుగాని। దాన్ని విడగ లేని దసలే । లేక పోయే ॥కా॥

2 ముచ్చట లెచ్చట గలిగెనో । ముచ్చటలకు మూలం ! హెచ్చుగనెవ్వరో । మూచ్చట లనవిన ముద మేమిగా నమి । ముచ్చట లేదోట్టు మును లయ మొందునో । అచ్చట నె సర్వంబు లయుకుని అదిహే పూర్ణబ్రహ్మమని గని సచ్చిదానందాత్మ మయమౌ స్వస్వరూపం బెద్దియున్నా ॥కా॥

ఉత్తమ జన్మమని యూర్ధ్వలోకావృత్తిసుఖముల మాని యుత్తమగురునిచే యుక్తిసూచన జేసి బోత్తిగ మానుము బుద్ధియూహాల నెల్ల । అతరిని యిక బలుకరాని దదిహే నిర్గుణ శుద్ధతత్వ మొత్తమేమని బలికిన సర్వ మోహముల విగనాశి యుండీ ॥కా॥

4 అద్వయమని పలుకను నిర్ద్వంద్వమున ద్వయమున్నదని తలచను। అద్వయాతీతా పూర్ణానంద పురమున సద్వయ రూపుతో ఆత్మరామగురుని చిద్విలాసానంద సూచన చిన్మయాత్మ సుబ్రహ్మణ్యుడు హృద్విశాసము తోడగను గాని యున్నదే తానున్నదాయెను ॥కా॥

కీర్తన

ఎవ్వారే నను మేల్కొల్పిన ఘను - లెవ్వారోయమ్మ సర్వ లక్ష్యాంతర్లక్ష్యులౌ సద్గురుడో యమ్మా ॥ఎ॥

1 నాదా బిందు కళలా కావల బోధకు లెవరమ్మా! తత్వ బోధకు లెవరమ్మా! ద్వాదశాంతము భావము దెల్పిన తత్వప్రభువమ్మా ॥ఎ॥

2 ఎంచరాని లోకా వాంఛలు - త్రుంచిన ఘను లెవరే వాంఛలు త్రుంచిన ఘను లెవరే? పంచదశి భావము దెల్పిన పరమాత్ము డమ్మా ॥ఎ॥

3 తోడబుట్టిన వారి పొందు తొలగించిన దెవరే? పొందు దొలగించిన దెవరే? షోడశాక్షరి మంత్రము దెల్పిన దొడ్డప్రభువమ్మా ॥ఎ॥

4 ధర పూర్ణానంద పురమున వెలసిన దైవం బెవరమ్మా? పరా దైవం బెవరమ్మా? గరిమా సుబ్రహ్మణ్యుని బ్రోచిన కారణ గురువమ్మా ॥ఎ॥

కీర్తన

మిమ్ముల మేము చాలా చాలా అడిగేది లేదు
నెమ్మనమున శ్రీ గురుభక్తి నిలచిన చాలు ॥మి॥

1 తారక యోగంబు మేము తలచేది లేదు
సారమైన గురుని బోధ దొరికిన చాలు ॥మి॥

2 సాంఖ్య విచారణ మేము చేసేది లేదు ముఖ్యముగ
మూడక్షరముల మునిగిన చాలు ॥మి॥

3 పంచముద్రల భావము మేము ఎంచేది లేదు
పంచదశి భావమును దెల్పిన చాలు ॥మి॥

4 ఎరుకా మరపుల జోలి మెరిగేది లేదు
పరిపూర్ణ రామగురుని కరుణే చాలు ॥మి॥

5 పూర్ణానంద పురమునందు పుట్టేది లేదు
పూర్ణానుభవ సుబ్రహ్మణ్యుని సేవయే చాలు.

శ్రీ సద్గురు అష్టకము. (శ్లోకములు.)

1 శ్లో॥ విమలానంద పయోాబ్ధి వీచినిచయా స్వీకృత స్వచిత్తాంబుజమ్ । సతత బ్రహ్మ విచారణా గుణమణి భ్రాజత్సువక్షస్థలం శ్రీఅమృతక సహస్రపద్మ నిలయబ్రహ్మణ మీశం పరమ్, కులుకుట్లాన్వయ దుగ్ధవార్ధి శశి సుబ్రహ్మణ్య మీడేగురుమ్.

2 శశ్వన్మహా మంగళ బ్రహ్మ వర్చసమ్। సంపూర్ణ మోక్ష ప్రకటీకృతాత్మకం। సంసార భారాలస దోష లాలసం బ్రహ్మణ మీడే గురువర్య ముత్తమమ్॥

3 శ్లో॥ సకలామ్నాయ సుధా ప్రవాహ రస-సంపూర్ణ స్వరూప స్థలమ్ - అకలంకంహి ప్రతాప వంశ తిలక

శ్రీరామ శిష్యం వరమ్ - అమర స్తుత్య మనంత ముత్తమ
గుణం। మానాంచితమ్ శ్రీముఖమ్ - ములుకుట్లాన్వయ
దుగ్ధ వార్ధిశశి సుబ్రహ్మణ్య మీళే గురుమ్॥

4
సమస్త యోగాభ్యసన క్రియాస్పదమ్ నిరస్త మప్పంక
మతీవ భాసురం - ప్రశస్త వైరాగ్య గుణప్రపూరితం
ఈశానమీళే గురువర్య ముత్తమమ్.

5 విలస ద్వేదరహస్య సంగ్రహణ సంవర్తి ద్వివేకాస్పదమ్
లలిత స్వాదు వచో విలాస గరిమ ప్రస్తార తేజోనిధిమ్
సుమహా రామ గురు ప్రసాద రసన ప్రహ్లాద భక్తి క్రమ
మ్ -ములుకుట్లాన్వయ దుగ్ధవార్ధి శశి సుబ్రహ్మణ్య మీళే
గురుమ్॥

6 అనంత కళ్యాణ కళా కలాపకమ్ సనాత నాజః ప్రతతి
పరిచారకమ్। వినోదనార్థం ధృత దివ్య విగ్రహమ్- శ్రీవిష్ణు
మీళే గురువర్య ముత్తమమ్ ॥

7 శ్లో॥ వర దిగ్దేశ వితాన భూషణ లసత్కీర్తి ప్రభా భాసు
రమ్ - సుఖదస్థాన మమోఘ పుణ్యఫల సారం సర్వభూ
తాత్మకమ్ - అమృత జ్యోతిష మాత్మ తృప్త మానసమ్
విశ్వాత్మకం - వ్యాపకం - ములుకుట్లాన్వయ దుగ్ధవార్ధి
శశి సుబ్రహ్మణ్య మీళేగురుమ్॥

8 శ్లో॥ నితాంత రామప్రభు ముఖ్య సేవకం। సుభక్త బృంద
స్తుత రమ్య రూపిణమ్- అమంద నిత్యాత్మ రత స్వమాన
సమ్ - శ్రీ దత్త మీళేగురువర్య ముత్తమమ్॥

ధీభాసురం । సుబ్రహ్మణ్య సుధీంద్ర మద్వయ మహం
వందే గురూణాం గురుం॥

3 శ్లో॥ ఆశారణ్య దవాగ్నిహోత్రి మమర ప్రోద్దీత నిత్యాస్త
వమ్ । కామ క్రోధ మదాది మర్దనచణం । కందర్ప
దర్పాపహమ్।విద్యుత్తేజస మాత్మ వేద్య మతులం। సమ్మో
ద వారాన్నిధిమ్ । సుబ్రహ్మణ్య సుధీంద్ర మ ద్వ య
మహం । వందే గురూణాం గురుం॥

4 శ్లో॥ రాజన్తం। రమణీయ వాగ్విలసనైః శ్వేదార్ధసందీపనైః
భ్రాజన్తం పరిపూర్ణ దివ్య కరుణా రూపైః కటాక్షై
ర్భృశం । స్వార్జన్తం సుమహా తపః సువిభవై సార్థైః
స్తమహా భంగకైః । సుబ్రహ్మణ్య సుధీంద్ర మద్వయ
మహం వందే గురూణాం గురుం॥

5 నిత్యం నిర్మలమాదిపూరుష మజం శాంతద్వయమ్ జ్యోతి
సం। సత్య జ్ఞాన మనంత సర్వ విభవం బ్రహ్మాదిభిః పూజి
తమ్ । దివ్యాకార మనాకృతిం మతిమతాం శ్రేష్ఠంసు
నిష్ఠావరం। సుబ్రహ్మణ్య సుధీంద్రమద్వయ మహం వందే
గురూణాం గురుం॥

6 శ్లో॥ శ్లోకపంచకమేతద్ధి సర్వపాప ప్రణాశనం పూర్ణానంద
సుధీప్రోక్తం బ్రహ్మానంద విశేషదమ్॥

—* చూర్ణిక *—

శ్రీమదఖండ వేదాంత । విద్యా పారావార మానస
సరోవర తీర విహారా। పరమహంస వరాయా రామ దేశిక

మృదు పదపద్మ మకరంద పాన జంఝూమృతగాన ।
నూన సంపన్న విజ్ఞాన షట్పదాయ - కృష్ణలీలా తరంగా
ప్రతర్కానుభవ ప్రసంగ వియద్గంగాఝరీ సమాసంగ
మంగళ స్వస్వరూప గాఢాలింగ రంగ దుత్తుంగ మాతంగ
మద విభంగ నటద్భృంగ భాగవత హృత్పంజరాంతరంగ
శుకాయా!

అనవరత గీతావాక్య ప్రమాణాఖిల ప్రబోధితానేక శిష్య
ప్రహోష్య వుపనిషద్భాష్య స్వధర్మ పారాయణ పారీణ
ధురీణ పరపారాశర్యాయ వరేణ్యాయా । అజ్ఞానతిమిరా
వృతా మమతా భ్రమతా । వనితా జనితా హంకార
భవాంగణ్య కింతారాయా !
అతులిత శ్రుతి స్మృతి కలిత విబుధవాక్ప్రమత్కృతీ రంజిత
తత్త్వాలంకృత విభవసంశ్రుత గాంధర్వ కళా సౌందర్య
విశారదావరూపనారదాయా!

సత్యసంకల్ప నిత్య కళ్యాణ సాక్షేందిరా మందిరా
సుందరానందతర పరాపర దయాపర వీక్షణ మహాపురుష
లక్షణాయా । అంతర్బాహ్య వస్తు తత్త్వాలోకన ప్రశస్త
జగదేక చక్ర పట్టాభిషిక్త సహజామనస్క మహారాజ
యోగనిష్ఠాగరిష్ఠ వర్తమాన స్థితి జనక మహీపాలక
శ్రేష్ఠాయా శ్రీమత్ప్రత్యావకుల కలశార్ణవవివర్ధన శ్రీరామ
గురుచంద్ర బుధేంద్ర పద ద్వంద్వోపాసక జనపాకవి ప్రతి
పాదితానవద్య హృద్య సద్యోముక్తి గద్య పద్య సద్వ్యాశః
పరిపూర్ణ బ్రహ్మవిలాసాయా । ములుకుట్ల వంశోపాదిత

చంద్ర సుబ్రహ్మణ్య సుధీంద్రాయా॥ దశకృత్వ శతకృత్వ సహస్రకృత్వా అపరి మితకృత్వోన్నమ స్తేనమః.

## — పరాకులు —

అవధరింపు సుబ్రహ్మణ్య అఖిల శిష్యజన శరణ్య అవధరింపుమా గురో! అవధరింపుమా॥

1 ముక్తిగోరి భక్తులు పదభక్తి సేయుచు నున్నవారు ॥ అ. నిత్యసత్యవ్రతా పరాక్॥

2 మంజులముల్ విరజల్లి బుధులు పింజామరల్ వేయుచున్నార॥ నిఖిల పంచోపనిషన్మయ దివ్యదేహ। పరాక్॥

3 కోల్లలుగను గాన నృత్యముల్లసిల్ల సల్పుచుండిరి అవధరింపుమా। సకల సాధు జన మనోనివాసా చిదాభాసా! పరాక్॥

4 ఆడి పాడి తోడి కూడి వీడి వేడుకొనుచునుంటి అవధరింపుమా। శ్రీ కృష్ణ లీలావతారా। శ్రీ రామభక్తాగ్రేసరం ॥పరాక్॥

5 ముద్దులలర పదపరాగ మద్ది కనుల కద్దుకొనుదు అవధరింపుమా। సంతతానంద హృదయారవిందా పరాక్॥

6 డెంద మానంద జలధి యందు చిందులాడ విందు అవధరింపుమా। సహజ అమనస్క రాజ యోగ సామ్రాజ్య అనుభవాతీతా పరాక్॥

7 పల్కుఁ జేసే లోల్కఁ జే కుల్కునగవు జిల్కుఁగిళలు అవధరింపుచూ॥

8 బసవ కవివతంసులాది పరమ భాగవతులు గొల్వ అవధరింపుమూ। ములుకుట్ల వంశోత్పాదిత చంద్ర సుబ్రహ్మణ్య సుధీంద్రాయా ॥పరా॥

—* పద్యం *—

శా॥ తే ప్రాయంబుననుండి శ్రీశుక మహర్షిన్ బోలి వేదాంత మా। కర్య బ్రహ్మసుఖవాది యోగ పరసౌఖ్య ప్రాప్తికై రామమూ। ర్తి బ్రహ్మంబును గొల్చి భాసిలు మహాతేజోమయుండైన మా। సుబ్రహ్మణ్య గురున్ భజింతు నెపుడెచ్చోనున్న నన్వేళలన్.

—* దండకం *—

శ్రీమన్మహాదేశికేంద్రప్రభూ భక్తచింతామణీ! ఆర్తరక్షామణీ। సాధుభృంగావనా పావనా ॥ పూర్వవిజ్ఞానసంపన్న మహానప్రదానా జగన్నాట్య లీలావతారా। దయాంత ప్రపూర్ణా। మిముఁ గొల్చు మత్పూర్వ భాగ్యంబునన్ స్తోత్రమున్ జేతు। నా దేవ దేవుండవున్। దివ్యరూపుండవున్ అప్రమేయుండవున్ స్వప్రకాశుండవున్ నిర్వికారుండవున్ నిర్వికల్పుండవున్ నిర్విపక్షుండవున్ నిర్విలక్షుండవున్ నిర్విశేషుండవున్ అయ్యు శ్రీరామకృష్ణాను కీర్తనన్ ధాత్రిభారంబు వారింపగా వచ్చిరో యట్లు ములుకుట్ల వంశాబ్ధి చంద్రుండవై

మానసానంద సత్కీర్తి సాంద్రుండవై పుట్టి యీ శిష్య
సందోహముగ నిత్యసంతోష వారాసి దేలింప సోపాన
సుక్షేత్రవాసుండవై యుండినట్లుంటివేగాని నీయున్న
తౌన్నత్యముగ మిన్నగా మిన్నదై తోచుచున్నా నినుగ
గానదేవంక గాన్పింపదద్దాని బ్రహ్మాదులే పల్కలేరార
నేనెంత శ్రీశాంతమూర్తీ! అనాద్యంతవర్తీ! మహాపుణ్య
సౌభాగ్యలక్ష్మీసమేతా! గురూత్తంస! శ్రీరామచంద్రప్రభు
స్వామిమాత బుధవ్రాత సంప్రీత సత్యవ్రతానేత వేంకచ్చ
మాంబాతనూజాత ! శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ! నమస్తే
నమస్తే నమః॥

## — మంగళహారతి —

సుబ్రహ్మణ్యా తే మంగళం గురుబ్రహ్మశీలాన తే
మంగళం॥

1 నిరతానంద పయోబ్ధి వీచికా నివహా నిమజ్జన మానసా
హరి హర బ్రహ్మ స్వరూప పరాత్మక పరమ పురుష తే
మంగళం ॥సు॥

2 రాజయోగ స్వవిరాజ మానసో త్తేజోమయ సనాతనా
భూజన నుత సద్బోధాతీత తపోవృతనిష్ఠ తే మంగళం ॥సు॥

3 రామదేశికేంద్ర ప్రియభక్త పారాయణ దీనజనావనా
ప్రాముఖ్యాస్థిత బసవకవి! స్తుతప్రార్థనీయ తే మంగళం॥సు॥

కం॥ ధరగల గురుభక్త్యాదులు
మురియుచు సద్గురుని శక్తి పూర్వక భక్తిగ

మురిపెల్ల బొందుదురుగా
చిరతరబ్రహ్మైక్య పూర్ణచిత్సుఖపదవిని.

—* యాలలు *—

1 శ్రీసుబ్రహ్మణ్య సుధీంద్ర! చిద్జ్ఞానగుణమణీసాంద్ర భాన
దిగ్యశః పూర్ణచంద్రా రే సద్గురు దేవా రాసక్రీడలోలా
నిస్తంద్ర ||శ్రీ||

2 భక్తమానస నివాసా బ్రహ్మసందాత్మ విలాసా త్యక్త
మోహా తత్వ్యపకాసా రే సద్గురు దేవా । ముక్తిద మౌన
ముద్రాభ్యాసా ||శ్రీ||

3 నిత్య సంతోష పంభాషా సత్యమార్గాచరణవేషా భృత్య
పేర జనసుపోష రే సద్గురు దేవా ॥ ముత్యాలత్న హార
విభూషా ||శ్రీ||

4 సోపానపురనిలయా సర్వసాధు బృందవిధేయా। వ్యాపార
స్వప్న స్తరాభాయా । సద్గురు దేవా। గోపాలగీత వాక్యా
శ్రయా ||శ్రీ||

5 శ్రీకృష్ణా లీలావతారా శిరిబాము భక్తాగ్రేసరా । శ్రీకర
సత్కృప సాగరా! రే! సద్గురుదేవా! ప్రాకృత విజ్ఞాన
భాస్కరా ||శ్రీ||

6 బసవ కవి వర స్తుత్త పరమ పావన చారిత్ర అసమ
కళ్యాణమయ గాత్ర! రే! సద్గురు దేవా । అసిపద సిద్ధాం
తాద్భుత చిత్ర ||శ్రీ||

## —* అష్టోత్తర శతనామావళి *—

సద్గురవేనమః 1
పూర్ణాయనమః
సర్వాధారాయనమః
స్వచ్ఛాయనమః
శుద్ధాయనమః
నిర్మలాయనమః
విశ్వోదరాయనమః
నిరాలంబాయనమః
రమ్యాయనమః
నిర్లేపాయనమః 10
నిర్వాసనాయనమః
నిర్గదాయనమః
స్వప్రకాశాయనమః
నిత్యతృప్తాయనమః
అనంతాయనమః
అద్వితీయాయనమః
వేదవాచామరేద్యాయనమః
పరంజ్యోతిషేనమః
ప్రణవాతీతాయనమః
అచలాయనమః 20
అపరిమితాయనమః
అప్రమేయాయనమః
అవ్యయాయనమః
అచ్యుతాయనమః
అహంకార వివర్జితాయనమః
విశ్వాత్మనేనమః
ప్రపంచాతీతాయనమః
మాననీయాయనమః
క్షరాక్షర విలక్షణాయనమః
దృశ్యాతీతాయనమః 30
ద్వైతాద్వైతనిర్ముక్తాయనమః
అఖండాయనమః
ఖండాఖండరహితాయనమః
ఆదిమధ్యాంతశూన్యాయనమః
నిరంజనాయనమః
నిర్వికల్పాయనమః
నిరాధారాయనమః
నిరాభ్యాసానమః
పరమానందస్వరూపాయనమః
సగుణనిర్గుణాతీతాయనమః 40
సర్వసాక్షిణేనమః
సాక్ష్యాతీతాయనమః
త్రిగుణాతీతాయనమః
సర్వభూతాంతరస్థాయనమః
సుఖదుఃఖ విరహితాయనమః
జన్మజరామరణవర్జితాయనమః

తత్త్వజ్ఞాయనమః
సర్వోపనిషత్కాన్తాయనమః
నిష్కళంకాయనమః
నిరాభాసాయనమః 50
స్వప్రకాశాయనమః
సృష్టిస్థిత్యంతకారాయనమః
కర్తృత్వరహితాయనమః
సచ్చిదానందాతీతాయనమః
అపరోక్షాయనమః
సకలమంగళస్వరూపాయనమః
ఆకాశతనవేనమః
నిరాధారాయనమః
నిరంశేనమః
అవికారాయనమః 60
అమలాయనమః
పరతత్త్వాయనమః
పరంధామ్నేనమః
అమలాయనమః
అజాయనమః
అగమ్యాయనమః
మహిమైశ్వర్య సంప
న్నాయనమః
సనాతనాయనమః

త్రిమూర్త్యాత్మనేనమః
అనాద్యంతాయనమః 70
సర్వోపాధి వినిర్ముక్తాయనమః
భక్తాభీష్టఫల ప్రదాయనమః
భవరోగ భేషజాయనమ.
సహస్రారచక్ర మధ్య
స్థాయనమః
సనకాదిమునివందితాయనమః
కామక్రోధాది శత్రుని
వృతాయనమః
కరుణాసాంద్రహృద
యాయనమః
బ్రహ్మవిష్ణుమహేశస్తు
తాయనమః
బ్రహ్మాండ జనకాయనమః
పరమపావనాయనమః 80
దీనజనానుగ్రహాయనమః
దివ్యపురుషాయనమః
ప్రసన్నపారిజాతాయనమః
పురాణపురుషాయనమః
నిరుపద్రవాయనమః
నిత్య కల్యాణాయనమః
సర్వోపనిషత్పంజరాయనమః
శబ్దాతీతాయనమః

జగన్నాథాయనమః
జగద్గురవేనమః 90
విష్ణవేనమః
సర్వతోభద్రాయనమః
నిగమార్థప్రతిపాదాయనమః
నిస్సంగాయనమః
సహజానందాయనమః
చిన్మయాయనమః
శ్రీమతేనమః
సహజ అమనస్కాయనమః
సాయుజ్యప్రదాయనమః
పంచబ్రహ్మమయాయ నమః 100
అజడాయనమః
భావాభావమధ్యస్థాయనమః
అమనస్కాయనమః
అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకాయనమః
సర్వాధారాయనమః
పరతత్వాయనమః
అత్యాతీతాయనమః
మనోవాచామ గోచరాయనమః 108

నానావిధ పరిమళ పత్ర పుష్పాన్ సమర్పయామి.

---

కీర్తిశేషులైన శ్రీ గురు ములుకుట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి
నిర్యాణం.

—* నవరత్నములు *—

సీ॥ అద్వైతమూర్తి బ్రహ్మానంద పాథోధి । హా! మమ్ము బాసి
బ్రహ్మైక్యమొందె। ఆత్మానుభవవిద్యా దగ్రణి హా మము
వీడి స్వర్లోక ప్రవిణుడయ్యె । సర్వ చరాచర సర్వప్రాణి
తుల్య ద । ర్శనుఁడు హా! మమువీడి సత్వమొందె

సర్వార్థసంత్యక్త గురుతర భాగ్యుండు । హా! మముపీడి
సద్యోక్త్రయయ్యె ।

గీ॥ దేహతత్త్వమున నేదేహిసమూహ మూహ। నేయు నోపని
బ్రహ్మణ్య సిద్ధమూర్తి।సుపద వీక్షిత గురుకీర శోభితుండు
సర్వసులభము గు నోంకార సద్మమందే. 1

శా॥ తండ్రీ! నీ విటులంటి పెద్ద యప మృత్యుస్వాధీన కష్టం
బునన్ । దీంద్రదంబైన విపద్ద వానలముచే । దీనుండనై
క్రాగి నీవాండ్రన్ మమ్ము సుతన్ గళత్రమును సర్వాన్
వృద్ధంబోనాడి యే । వాండ్రన్ గాంచగలేని బ్రహ్మ
పదవిన్ భాసిల్లితే శ్రీగురూ.

సీ. అవతరించిన యట్టి హరి బుద్ధదేవుడ । వంచు గ్రామస్తు
లర్చించినారు । మూర్తీభవించిన ముని జడభరతుడ
వంచు విజ్ఞులు ప్రస్తుతించినారు ప్రత్యక్షముగ వర ప్రద
డైన దత్తుండ । వంచు భక్తాళి యూహించినారు
తత్త్వానుభూతి విధంబున జనకుండ । వంచు శిష్యాళి
కీర్తించినారు

గీ॥ మదర పండిన వేదాంత మహితఫలము! వయసు ముప్పది
లేని లే । బ్రాయుగాడ-కటికి దైవంబు నీయందు కన్ను
వైచె। నయ్యయో! మాదు దుఃఖమేమందు నేడు. 3

శా॥ ఊహావిస్మృతి లేని చిట్టి తనయున్ యోగాత్మ సర్వాంగి
నే ప్రూహాల్ పుట్టని వట్టి తల్లిని జయం బూహించు మి
త్రాళి దుర్గోమహారణ్యాతురార శిష్యగణమున్ । బూజ్యున్
గురున్ వీడియున్! దేహప్రాప్యముగాని మోక్షపదవిన్ 4
ధీరాత్మ తన్ గొంటివే॥

సీ॥ శ్రీరామ దేశికుడా రామ విభుడుగా భరతుండ వను కీర్తి బడసినావు॥ రామగురుండు నారాయణాంశజుడుగా సరుడను విఖ్యాతి నరసినావు। రామవిభుండు విరాడ్విష్ణుమూర్తిగా హరుడవీవంచు బేరందినావు। రామ సద్గురుడు విరాగి దత్తాత్రేయు లొగిగాగ నహుమత నొందినావు.

గీ॥ అట్టి నీవిట్టి జంట స్నేహంబువదలి యొంటరిగ నుంటి వౌర సదోపదమ్ము అంచు చినతండ్రి వయ్యు బ్రహ్మాణ్య మూర్తి నీదు దర్శన భాగ్యంబు లేదుగాదె. (౮)

ఉ॥ ఏ యవతార మందయిన। నెన్నక జంటను బాసి యొక్క- రా।హా! యటము క్తదేహులయి పోయి మొ।ంగిరే నేడటన్న నా। రా యటు సద్గురుండునగు। న గ్రజుకున్ కుడిచేయి బోవగా।హా! యనసంగ స్వస్థిత మహాగనుగొం టిదె చిన్నకక్కురో

శా॥ హాయిన్ గూర్చెడి తత్త్వబోధ ప్రకటం। బైయున్న శాంతంబు దు। రేయంబైన తపస్సమాధి విహిత శ్రీజాపు లేచూపుఁ గ్రొంగ్రొ బాయంపుచ్ హరి గుజ్జరూపు మృదుప్పై భాసించు వా।గూపు-వి ద్వేయంబై తగు నీదుప్రాపు కఱ వాయెన్ గాదనేఁ జోపి కా.

సీ॥ మాకు పితృవ్య సమ్మద సంపదయు బోయె। కూతురు తండ్రియే కొదవ యాయె। మాకు ప్రాణ పద నన్మి త్రు డేకేడాయె। భార్యకు ప్రాణ హృ। త్ప్రభుడు బోయె-చూపు ప్రియంవద। మణి శేఖరుడు బోయె భక్తుల గ్రొంగ్బెడి। పడుటలాయె। రామ దేశికు సుస్థిర

బలమున్ బడిపోయె । నమ్మకు ప్రాణ పదమ్ము బోయె ।

గీ॥ హా! హా!! హా!!! యేమంను లోక కళ్యాణ మూర్తి అవతరించిన హరిమూర్తి! అవహాతాగ్ని । బ్రహ్మ తేజ స్ఫురన్మూర్తి విమల కీర్తి । ఆత్మపదమందె నౌర బ్రహ్మణ్య మూర్తి॥ (8)

తే. గీ. కలియుగంబున అద్వైతకళకు-పాడు జేసి పాదుకొల్పి తత్సిద్ధిగనమి । నాది శంకరు డిటుల । బ్రహ్మణ్యు డయ్యవతరించియు తత్సిద్ధి నంద జేసె । భాద్రపద కృష్ణ సప్తమి భానువాసరమున నీశ్వర నామక సమమునందు । పూర్ణతాదాత్మ్య సిద్ధినిబొంది శాశ్వతమ్ముగా దివ్యరూపినై తే? మహాత్మ॥ (9)

గీ॥ శాంతిరస్తు భవన్మనస్సరసిజస్య-నవ్య పూర్ణపరాకాశ । నామరూప రహిత శాశ్వత ! తత్వ విరాజమాన సర్వగత । సర్వమూర్త - విశ్వ స్వరూప॥ (10)

ఇత్థమ్ముపి ధేయాః సర్వేసుతాః
ప్రతాపవంశీయాః గురుపుత్రాః.

—* మేలుకొలుపు - భూపాల రాగం * —

మేలుకో శ్రీరామా - మేలుకో గురునామా మేధానిధి స్తోమా - మేలుకో - మేలుతో పృచ్ఛకై కీలుదెలియవస్తి - చాలాయోగ నిద్రనేలుకో గురువరా॥గ॥చిచ్చోచ్ఛ్వపుళ్ళ కాని- చిన్మాత్రనమున తల్లి- మెచ్చి హాయిని చెప్పి మేలుకో-అచ్చట చలియుక మెచ్చాటాడగ వస్తి హెచ్చుగ హాయిని దేల్చా మేలుకో॥౨॥ లోకంబు లెల్లను రాశి సి మాయచే చీకాకు గమ్మను మేలుకో ఏక మేవా ద్వితీయం బ్రహ్మని శృతి జోక

బల్కుచున్నది మేలుకో॥గురు॥3॥ సాధనా సంపత్తి సమరాన గల జ్ఞాన - సాధులొచ్చినారు మేలుకో - సాధానంతను గాథలు దీర్చి పూర్ణబోధ తత్వము దెల్ప మేలుకో ॥అ ॥౪॥ పరమభక్తులెల్లా పాదసేవలు జెయా నరుదెంచియున్నారు మేలుకో నిరతా సంపూర్ణ నిజరూపమును దెల్పి నిత్య పూజ లందా మేలుకో॥౫॥ వాసిగ పూర్ణానంద వర పూరంబున నున్నావరదా శీతారామా మేలుకో - భూసూరుడౌ భక్తి పూర్ణ సుబ్రంహ్మణ్యని - పూర్వా జన్మాబాసె మేలుకో గురువరా ॥౬॥

—* మేలుకొలుపు *—

గోలమానర ముద్దులయ్యా మేలిమి బంగారయ్యా - యేలరా ముమూర్తులయ్యా మేలుకొనవయ్యా॥దత్తా మేలుకొనవే॥౧॥ లేక లేక కలిగితివి - మాఃపోగలా పొమ్యేదవేరా రాకుమారా లాలబోసి సాకకొనియెదరా॥దత్తా॥ ౨॥ బాయి ఇచ్చి తొట్టిలోనే పండవేయగానే యిపుడే । రేయిబవలు నిదుకబోవు మాను అల్లరియేలరా ॥3॥ అమ్మమ్మా కన్ను మూసినా అఖిల జగములు కల్లలే - లెమ్మా నాలోనున్నా యీా విశ్వంబునే గానా ॥దత్త॥ ౪॥ ఎన్నినోములు నోచి నే నిను కన్నులారా గంటినో అన్నదుమకులు మానరా మీా నాన్నతో జెప్పెనురా॥దత్త॥ ౫ కొట్ట చేతులు రావురా నీ పొట్టలో యేమున్నదో గాని - యీా గుట్టుదెలిసిన వారు భువిలో పుట్టి సిట్టారన్నా ॥దత్త ॥౬॥ బాయిబోశి గిన్నెనిండా పట్టెడు బువ్వాను బెట్టినా హాయిగా భోంజేసి నేనుఆడుకొందు

నమ్మా ॥దత్తా॥ 7॥ రాముడేశిక మందిరంబున రమ్యబాలక్రీడ
సల్పగా ఆమహోత్సవమెపుడు చూచెడి ఆశతోనుంటి ॥దత్తా॥

## —* శ్రీరామ భజన కీర్తన *—

అనంతరూపం - అవ్యయపదము । అదుగో చూడో
యిరాంభజనా - కనండి కన్నులు గలవారల కది కల్పవృక్ష
మోయి రాంభజనా! అది కామధేనువోయి రాంభజనా॥అ
రాదు పోదు అది యేమికాదు మది - అది అనాదో
యిరాంభజనా । సూదిమోప మొటుసందు లేదు బల్ -సుందర
మైనది రాంభజనా॥అ॥౨॥ మూటిమూటి యిరుమూటిదెలిశిన
ముక్తి మార్గమోయి రాంభజనా - కోటికపక్షుల కూటమి
కావలి - కోట జేర్చునోయి రాంభజనా॥అ॥ 3॥ చీకటిచింతల
కన్వల దొంగల జేరనివ్వదోయి రాంభజనా రాక పోక
మరియేమి కాకను యేకమైనదోయి రాంభజనా॥అ॥3॥

4 పాపకూపమున బడనివ్వదు అది । జనితయోగ్యమోయి
రాంభజనా । తాపసోత్తముల దాపైయున్నది । దత్త
రూపమోయి రాంభజనా ॥అ॥

5 కిందు మీదు నలుసందుల జూచిన సందులేనిదోయి
రాంభజనా । సనకసనందాది నారదాదులు పొంది
చేసిరోయి రాంభజనా ॥అ॥

6 పూర్వానందా పురవరంబునను పుట్టి పెరిగెనోయి రాం
భజనా । పూర్ణానుభవ సుబ్రహ్మణ్యుని పూజనీయ
మోయి రాంభజనా ॥అ॥

7 కామిత ఫలదానంద గురు పభస కల్పసమానమోయి
రాంభజనా ! శ్రీమత్ప్రతాపరామాభి ధానులుచేశి
చూపినోయి రాంభజనా ॥అ॥

—* భజన కీర్తన *—

1 అయోధ్యవాసీరాం । దశరథనందనరాం । జానకీ జీ
వనరాం । జయ జయ రామరామరామా ॥అ॥
2 సరయూతీర విహారీ ॥ దండక వనసంచారీ
రావణకుల సంహారీ । శ్రీరామచంద్ర మురారీ ॥అ॥
3 యమునాతీర విహారీ । భృందావన సంచారీ
గోవర్ధనగిరి ధారీ । గోపాలకృష్ణమురారీ ॥అ॥
4 గంగాతీర విహారీ । దారుకవన సంచారీ
త్రిపురాసుర సంహారీ శివనీలకంఠ అసురారీ ॥అ॥
5 భీమాతీర విహారీ । కార్ష్మగవన సంచారీ
గాంగాపుర విహారీ । నరసింహ దత్తమురారీ ॥అ॥
6 చంద్రభాగతీర విహారీ । గోకుల వనసంచారీ
పండరిపుర విహారీ । జయ పాండురంగమురారీ ॥అ॥
7 కృష్ణాతీర విహారీ । భక్తబృందసంచారీ
పూర్ణానంద విహారీ జయ పూర్ణతీర్థమురారీ ॥అ॥

## తత్త్వం

బ్రహ్మ మిదియుగాదురా । భ్రాంతియు బోను । పరిపూర్ణమై నిండెరా । బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పరబ్రహ్మ తత్వమొందుటకు గురుబ్రహ్మ జేరియు కరుణగొలువగా ।

## కీర్తనలు.

బ్రహ్మతత్వం తానే అరయరా ॥బ్రహ్మ॥ జపతపంబులు
తానేరా బ్రహ్మముజూడ - అజపానూటియు బోయెరా ।
అపరిమిత యజ్ఞాదిక్రతువులుఁ అవని యోగాద్యష్టసిద్ధులు -
వుపనిషద్వేదాంత శృతులైపోయి పింగ్ళికి మేళయాయెనూ॥బ
సత్తు చిత్తులు తానేరా బ్రహ్మముచూడా ।వృత్తిరహిత
మాయరా । వృత్తిరహితంబైన దానిలో వున్నదానిని గన్న
మీదట । ఆత్మసామ్మల్లుంను దానము యొత్తములనజేసినటు
లాయెను ॥మేల 2॥ ధరను పూర్ణానందా పురమున వెలశిన
ధాముడ నీవేనురా । సరస సుబ్రంహ్మణ్య గురువరు । వతి
పూర్ణ స్వానుభవరీత్యధరను శ్రీప్రతాపరామయ ధాముడవై
వెలశినావు ॥బ్రహ్మ॥ 3॥

### —* భజనకీర్తన *—

శ్రీకృష్ణ చైతన్యప్రభు నిత్యానందం । హరేరాం హరే
కృష్ణ రాధేగోవిందం । గోవింద గోపాలా హరే మురారే ।
హేనాధ నారాయణ వాసుదేవా ॥శ్రీ॥ సత్య జ్ఞానానంద
సంపూర్ణ భావా । నిత్యా నిర్వికారా నిర్గ్రహదేవా ॥శ్రీ 1॥
మాధవా గోవింద మదనగోపాలా । శ్రీధర ముకుంద శ్రీశ
భూపాలా ॥శ్రీ 2॥ కాళియ ఫణిమాణి క్రగమనట చరణం
మాళిచూడ కింకాపమా కిరీటహారం ॥శ్రీ 3॥ శ్రీరామదేశి
కోత్తమ చిత్ప్రకాశం చిత్సుఖబోధాత్మ చిదచిద్విలాసం ॥శ్రీ॥
వాసీ పూర్ణానంద నరపురవాసం । దాస సుబ్రహ్మణ్యదై
వసంతోషం ॥శ్రీ 5॥

## గురుప్రార్థన

శ్రీగురునాథ శ్రీగురునాథ శ్రీసుబ్రహ్మణ్యేశ్వర గురునాథా శ్రీ గురునాథా మద్గురునాథా శ్రీసుబ్రహ్మణ్యేశ్వర గురునాథా । బోధస్వరూప పూజకలాపా సాదర మతిను న్నెమ్మలుసుధీరా – ఆధారము నీవే బాధాలు మాన్పను సాధుజనానంద సద్గుణ వరబృందా ॥శ్రీ 1॥ కామాద్రివైరి సంహార ప్రతాపా రామాభిధాన యోగీంద్రహృచ్చో॥ । కామ రహిత సౌందర్య శరీరా మామది ననించు మమ్మేలు ధీరా ॥శ్రీ 3॥ పరగా పూర్ణానంద పట్టణధామా । సరస సజ్జన శిష్య సన్నుత నామా । గరిమ సంసారాంధకార విరామా సరస శ్రీ భక్తుల సన్నుతనామా ॥శ్రీ 4॥

## —* భజన కీర్తన *—

రాధే గోవిందకృష్ణా – రాధే గోపాలకృష్ణ బోధానంద సాగరకృష్ణ పూర్ణ భావ శ్రీహరి కృష్ణా ॥రా॥ ౧. బూచి బూచి అనకృష్ణా బెడతరమా చిన్నికృష్ణ కాచుకున్న వారము కృష్ణ – కరుణజూడర బాలకృష్ణా॥ రాధే॥ ౨. చూచుచుండ లేము కృష్ణ దాచుకొన్న సొమ్ము కృష్ణా దోచుకున్నవాడవు కృష్ణా – దోవజూ పర బాలకృష్ణా ॥రాధే॥ ౩॥ ఆటపాటలందు కృష్ణా అమరిన బలరాము కృష్ణా వేటపాలెంపురమున కృష్ణా వెలసిన బలరామకృష్ణా॥రాధే॥ ౪. భక్త బృందమునకు కృష్ణా నవబాధలు లేవు కృష్ణా భక్త సుబ్రహ్మణ్యుని కృష్ణా భవరహితునిజేసి కృష్ణా ॥ రాధే గోవింద కృష్ణా॥ ౫.

## —* లాలిపాట *—

దత్తాలాలీ - శ్రీ గురుదత్తాలాలీ - దత్తాత్రేయ గురు పురుషోత్తమలాలీ॥ ౧. శ్రీ యదువంశోద్ధారక నిన్నెడబాయ జాలనురా మా కోరిక హితమైన ముక్తి మార్గమివ్వరా ॥దత్త॥ సర్వలోక భూతములను సంరక్షించగా నిర్వాహించిబడలినావు నిదురజెందరా ॥దత్త॥ ౨. శౌర్య వీర్యాదులనెల్ల కడకు ద్రోలినావు మూర్తిత్రయరూపుడవు శక్తినివ్వరా ॥దత్త॥ 3. ధరను పూర్ణానంద పురమున ధాముడవై వెలసి గరిమ సుబ్రహ్మణ్యుని బ్రోచిన కారుణ్యగురుడవురా దత్తలాలీ - శ్రీదత్త.

### నలుగుపాట - శ్రీరాగము అనుమూంబరి

శ్రీగురువరేణ్య - శ్రితజనానుగుణ్య బాధిత సంసారణ్య భక్తశరణ్య. ౧. సర్వాత్మయ మూలా నే నిర్మల సంపగినూనె జన్మరహితంచే తల అంటెదనిపుడు శ్రీ గురు.౧ పోసనాత్మయ నలుగు వర దేహత్రయములది భాసురంబుగ మంచి పరికుళాయిదెదను ॥శ్రీ॥ ఆనందామృతమూనే ఆత్మస్నానము జేసి - స్వానందారూపంబౌ - స్వస్వరూపమందీ. శ్రీ గురు. 3 ధర శ్రీ పూర్ణానందా వరపురంబుననున్నా దాసా సుబ్రహ్మణ్యుని దైవతంబౌనీకు శ్రీ గురు!

## —* భజన కీర్తన *—

గోవింద గోవిందా గోపాలకృష్ణా కృష్ణా - నీవెందు బోతివో - నందనందనా నా॥గో॥ ౧. బలరాము తమ్ముడంటా బాలకృష్ణామూర్తియంటా కలకాలముండునంటా కరుణాతో - బ్రోచునంటా॥గోవిందా॥ ౨. దేవకిపుత్రుడంటా దేశమెల్లా తానే యంటా భావభావాతీతుండంటా - భక్తులాకే దొర

కూసనంటూ ||గోవిందా|| 3. ముందు వెనుకా తో నేయుంటూ నందు తేకా నింజేసనంటూ అంధులకు దొరకొడుంటూ సంహసింటూ పుట్టినంటూ||గోవిందా||౪. గోపులాను గాయునంటూ గోపి కాలాగూడేనంటూ పాపములా బాపునంటూ బాల గోపాలు డంటూ ||గోవిందా||౫. రామనామ రూపుడాటూ సామరూప రహితుడంటూ నా మనోభీష్టదాట భవంబూ కుదుటంటూ - ||గోవిందా||౬. వాలు దేవ నామములూ సల్లుగ వల సెనట ఆశపాశవిత మానసా బంతటాను నింపనాటూ ||గోవిందా|| ౭. అభ్రభంగి షాటూపుడటూ ఆత్మార్పణ ప్రార్థాటు సుబ్రహ్మణ్య ప్రవాముట సోహంభావాతీతుడంటూ ||గోవిందా గోవిందా||౮

—*తత్వం*—

ఎక్కడను చిక్కని - చక్కని యాకారము - చిక్క మక్కువ దక్షిణా నక్కతర బాని మసుర శక్కిగోరి భుజి యించ - టక్కుల దుళ్ళకు యాగా ||యు|| ౧. తిన్న తిన్నగ దినగ - తిన్న బాలిని బాను - తిని తిన్నగానుండేను యెన్ని నొన్ని విధములను - నెతుకవలెనని కోగా .. మిన్ను సున్న యేగా||యక్క||౨. అస్త్ర శస్త్రాది జలమగ్ని వాయువులకు - అంత మది బోధగాదూ|| అస్త్ర శస్త్రాదులను అంటి అన్నిట మించి - అంతను తానుండగా||యు||౩. సర్వదేశములందు సర్వ కాలములందు సంపూర్ణముననిండేగా సర్వం ఖల్విదం బ్రహ్మ తీత్తైతాను - సంపూర్ణముగనుండేగా ||యు||౪. ధరను పూర్ణా నంద వరపురంబుననున్న భామ శ్రీరామ గురుని - తన నిజా నుభవమున సుబ్రహ్మణ్యుడను అనఘుడై పూజించు వేళ మీదూ ||యక్కడను చిక్కను చక్క||